# ఈనాడు ఆదివారం

16 జులై 2017



వ్యాట్
ప్రవేశ పన్ను
కేంద్ర అమ్మకం పన్ను
కేంద్ర ఎక్సైజ్ డ్యూటీ
వినోద పన్ను
సేవా పన్ను

జీఎస్‌టీ

# ఒకే దేశం... ఒకే పన్ను!




# పజిల్




## గుర్తుపట్టారా?

నాలుగేళ్లుగా ప్రభాస్‌ని బాహుబలిగానే చూస్తున్నాం. ప్రభాస్ నటించిన అంతకు ముందరి సినిమాల్లోని కొన్ని స్టిల్స్ ఇవి. ఈ స్టిల్స్ ఏ సినిమాల్లోవో గుర్తుపట్టండి!

## కొత్త సినిమా గురూ

తెలుగు పరిశ్రమలో త్వరలో రాబోతున్న ఈ సినిమాల్లో హీరోలెవరో చెప్పండి.

1. జై లవ కుశ
2. టచ్ చేసి చూడు
3. సాహో
4. స్పైడర్
5. పైసా వసూల్

## పాటే సినిమా

ఎడమవైపు ఉన్న సినిమాల్లోని పాటలే కుడివైపు సినిమాలకు టైటిళ్లుగా వచ్చాయి. వాటిని జతచేయండి.

| | |
|---|---|
| 1. రేసు గుర్రం | ఎ. కుందనపు బొమ్మ |
| 2. బాద్‌షా | బి. సాహసం శ్వాసగా సాగిపో |
| 3. ఒక్కడు | సి. ఎవడే సుబ్రమణ్యం |
| 4. కొంచెంఇష్టం కొంచెంకష్టం | డి. బంతిపూల జానకి |
| 5. ఏమాయ చేసావె | ఇ. సినిమా చూపిస్త మావ |

## ఎవరికి ఎవరు?

ఇక్కడున్నవారంతా చిత్ర పరిశ్రమలో ఉన్నవారే. ఒక్కో ఫ్రేమ్‌లో ఉన్న ఇద్దరి మధ్య బంధుత్వం ఏంటో చెప్పగలరా?

1.
2.
3.
4.
5.

## ఏ రాజా?

ఇక్కడున్న హీరోహీరోయిన్లు నటించిన సినిమా పేరులో చివర రాజా వస్తుంది. ఆ సినిమా పూర్తిపేరేంటో చెప్పండి.

1. శర్వానంద్, సురభి జోడీగా వచ్చిన రాజా?
2. అల్లరి నరేష్, సాక్షి చౌదరి నటించిన రాజా?
3. వెంకటేష్, దివ్య భారతి కాంబినేషన్లో వచ్చిన రాజా?
4. చిరంజీవి, విజయశాంతి నటించిన రాజా?
5. శోభన్‌బాబు, రాధ జంటగా వచ్చిన రాజా?
6. వెంకటేష్, నగ్మా జోడీగా నటించిన రాజా?

## బొమ్మల్లో సినిమా

ఇక్కడున్న బొమ్మలు సూచిస్తున్న సినిమా పేర్లేంటో చెప్పగలరా?

1.
2.
3.
4.
5.

## దర్శకుడే అతిథి

ఇక్కడున్న దర్శకులు వారు దర్శకత్వం చేసిన సినిమాల్లో పాత్రల్ని కూడా పోషించారు. అవేంటో చెప్పండి.

1. వినాయక్
2. వైవిఎస్ చౌదరి
3. శేఖర్ కమ్ముల
4. పూరీ జగన్నాథ్
5. రాజమౌళి

(సమాధానాలు 29లో)

## మళ్లీ వినిపించింది

దిగువనున్న పాటలు ఇది వరకు సినిమాల్లో ఉన్నవే. ఆ తర్వాత వచ్చిన సినిమాల్లోనూ వినిపించాయి. ఆ రెండు సినిమాల్నీ చెప్పండి

1. గలగల పారుతున్న గోదారిలా...
2. శుభలేఖ రాసుకున్నా ఎదలో ఎపుడో...
3. దంచవే మేనత్తకూతురా...
4. వెన్నెలైనా చీకటైనా...
5. ఈ రేయి తీయనిది

## సినిమా చెప్పగలరా

అబ్బాయిది వైజాగ్‌లో స్థిరపడిన తమిళ కుటుంబం. పక్కింట్లో ఓ తెలుగు అమ్మాయి ఉంటుంది. ఇద్దరూ ప్రేమలో పడతారు. కానీ ఇంట్లో వారి ప్రేమను అంగీకరించరు. అయినా వాళ్లు వెనక్కు తగ్గరు. ఆ సమయంలో ఓ పెద్ద మనిషి వారి ప్రేమకు పరీక్ష పెడతాడు. ఏడాదిపాటు ఒకరితో ఒకరు మాట్లాడ కుండా ఉంటే వారి ప్రేమను పెద్దలు అంగీకరి స్తారనేది పరీక్ష... సినిమా గుర్తుకు వచ్చిందా?

## చెప్పండి చూద్దాం

వెనక్కి తిరిగి ఉన్న ఈ నటి ఎవరో చెప్పండి చూద్దాం!



## విద్యార్థులకు కలెక్టర్ ఆహ్వానం..!

పాఠశాలలో జరిగే వేడుకలకు కలెక్టర్‌ను ఆహ్వానించి వారి చేతుల మీదుగా విద్యార్థులకు బహుమతులను ప్రదానం చేయించడం చూస్తూనే ఉంటాం. కానీ మణిపూర్‌కు చెందిన కలెక్టర్ ఆర్మ్‌స్ట్రాంగ్ పమే విద్యార్థులనే తన భవనానికి ఆహ్వానిస్తున్నాడు. 'మణిపూర్ మిరకిల్ మేన్'గా పేరొందిన ఈయన ప్రజలకెంతో అభిమానపాత్రుడయ్యాడు. ఫేస్‌బుక్ పేజీ ద్వారా నలభైలక్షల రూపాయల విరాళాలు సేకరించి, ప్రభుత్వ ప్రమేయం లేకుండా మణిపూర్ నుంచి నాగాలాండ్, అసోంలకు 'పీపుల్స్ రోడ్డు'ను నిర్మించాడు. ప్రతి శుక్రవారం ఆరు నుంచి పదో తరగతి చదువుతున్న పదిమంది విద్యార్థులను కలెక్టర్ ఆఫీసుకు ఆహ్వానించి జిల్లా యంత్రాంగం పనితీరును దగ్గరుండి చూసే అవకాశం కల్పిస్తున్నాడు. ఆ సాయంత్రం వారికి భోజనం కూడా ఏర్పాటుచేస్తున్నాడు. జిల్లాను ఎలా అభివృద్ధి చేయాలనే విషయంలోనూ విద్యార్థుల అభిప్రాయాలను తెలుసుకుంటున్నాడు. ఇలా విద్యార్థులను ఆహ్వానించడం వెనుక ఆసక్తికరమైన కథ ఉంది. ఆర్మ్‌స్ట్రాంగ్ చిన్నతనంలో డిప్యూటీ కమిషనర్ ఆఫీసుకు వెళ్లి అక్కడ జరిగే కార్యక్రమాలను స్వయంగా చూడాలని ఆశపడేవాడట. కానీ అక్కడి అధికారులు అతడిని లోపలికి అనుమతించలేదట. అందుకే కొత్త విషయాలను తెలుసుకోడానికి ఆసక్తిచూపించే వారిని నిరుత్సాహపరచకూడదనే ఉద్దేశంతో ఇలా విద్యార్థులను ఆహ్వానిస్తున్నాడట.

## లోపల...



**ఒక దేశం... ఒకే పన్ను!**

దేశవ్యాప్తంగా ఇప్పుడు చర్చంతా కొత్తగా అమలులోకి వచ్చిన వస్తు, సేవల పన్ను గురించే. జీఎస్టీ వల్ల దేశ ఆర్థిక వ్యవస్థలో సమూల మార్పులొస్తున్నాయని కేంద్ర ప్రభుత్వం చెబుతోంది. కానీ అందులో నిజమెంతో, అబద్ధమెంతో, జీఎస్టీ వల్ల లాభమెంతో, నష్టమెంతో తేల్చుకోవాల్సిన బాధ్యత మనదే. **7**



## మీ మాట



ఈ సంచికపై మీ అభిప్రాయాలను sunday@eenadu.netకు మెయిల్ చేయవచ్చు.

### స్ఫూర్తిదాయకం

'ఐడియా కావాలి నాయనా' కథనం ఎంతో స్ఫూర్తిదాయకంగా ఉంది. పెద్ద పెద్ద సంస్థలు కూడా 'క్రౌడ్‌సోర్సింగ్' ద్వారా వినియోగదారుల ఆలోచనలను ఆహ్వానించడం శుభ పరిణామం. పాలనా వ్యవహారాల్లో 'క్రౌడ్‌సోర్సింగ్'ను భాగం చేయడం ద్వారా ప్రధాని మోదీ ప్రజలకు మరింత చేరువయ్యారనడంలో సందేహంలేదు.

*– బి.కమలాకర్, ఖమ్మం*

*– రామకృష్ణ(ఈమెయిల్)*

### కనువిప్పు

'లోపలి మనిషి' కథ ఆలోచింపజేసింది. క్షణికావేశంతో విచక్షణ కోల్పోయేవారికి కనువిప్పు కలిగించేలా ఉంది. యజమానిని దేవుడిలా భావించే పనిమనిషి కల్మషంలేని మనసును విశ్లేషించిన తీరు హృద్యంగా ఉంది.

*– మీనాక్షి కులకర్ణి, జెక్లేరు(మహబూబ్‌నగర్ జిల్లా)*

### ఉపయుక్తం

'కొత్తగా'లోని వస్తువులు ఆధునిక సాంకేతికతకు అద్దంపడుతూ ఉపయుక్తంగా ఉన్నాయి. సూప్‌లను తయారుచేసే సూప్ మేకర్లూ, దువ్వెనలూ ఆశ్చర్యపరిచాయి. పిల్లల స్పాలూ, సెలూన్లూ ఆకట్టుకున్నాయి. సియోల్‌లోని పాత వంతెనను పచ్చని పార్కులా మార్చడం బాగుంది. చివరి పేజీలోని లాంతర్ల ప్రవాహం కనువిందు చేసింది.

*– ఎల్.లలితాదేవి, వరంగల్*

### ప్రత్యేక గుర్తింపు

నటుడు ఆది పినిశెట్టి జీవితానుభవాలు ఆకట్టుకున్నాయి. హీరోగా నటిస్తూనే విలక్షణమైన పాత్రల్లో కనిపించడానికి ప్రాధాన్యమివ్వడం బాగుంది. తనకంటూ ప్రత్యేక గుర్తింపును తెచ్చుకున్న ఆది మరెన్నో విభిన్నమైన పాత్రల్లో కనిపించాలని కోరుకుంటున్నాం.

*– సీహెచ్.అభిజిత్, హైదరాబాద్*

### ఆశాజ్యోతి

అన్నార్తుల ఆకలి తీరుస్తోన్న భక్తి వేదాంత ఆశ్రమం గొప్పతనం గురించి ఎంత చెప్పినా తక్కువే. మానవసేవే మాధవసేవని నిరూపిస్తున్న ఈ ఆశ్రమం అన్నార్తుల పాలిట ఆశాజ్యోతే. వేద పాఠశాల ప్రాచీన గురుకులాలను గుర్తుచేసింది. మిగతా రెస్టారెంట్లకంటే భిన్నమైన వంటకాలతో సాగిపోతున్న గగన్ ఆనంద్ ప్రయాణం ఎంతో స్ఫూర్తిదాయకం.

*– మునగవల్లి జగన్మోహన్, విశాఖపట్నం*

*– పచ్చల కోటేశ్వరరావు, పెదగొట్టిపాడు(గుంటూరు జిల్లా)*

### ఆలోచింపజేశాయి

ప్రకృతి దృశ్యాలను ఫ్యాషన్‌గా మలచిన తీరు ఎంతో బాగుంది. ఆసియాలోనే నంబర్ వన్ షెఫ్‌గా పేరొందిన గగన్ ఆనంద్ జీవిత విశేషాలు ఆలోచింపజేశాయి. రొటీన్‌కు భిన్నంగా వంటకాలు చేయడం వల్లే ఆయన ఆ స్థాయికి చేరుకోగలిగాడు.

*– డాక్టర్ శివభూషణం, కర్నూలు*

### మంచిమాట

ధనాన్ని చూసి దరిచేరే బంధువులు, అందాన్ని చూసి కలిగే ప్రేమ, అవసరం కోసం కలుపుకునే స్నేహం... ఎన్నటికీ శాశ్వతం కావు.

## విద్యార్థులకు కలెక్టర్ ఆహ్వానం..!

పాఠశాలలో జరిగే వేడుకలకు కలెక్టర్‌ను ఆహ్వానించి వారి చేతుల మీదుగా విద్యార్థులకు బహుమతులను ప్రదానం చేయించడం చూస్తూనే ఉంటాం. కానీ మణిపూర్‌కు చెందిన కలెక్టర్ ఆర్మ్‌స్ట్రాంగ్ పమె విద్యార్థులనే తన భవనానికి ఆహ్వానిస్తున్నాడు. 'మణిపూర్ మిరకిల్ మేన్'గా పేరొందిన ఈయన ప్రజలకెంతో అభిమానపాత్రుడయ్యాడు. ఫేస్‌బుక్ పేజీ ద్వారా నలభైలక్షల రూపాయల విరాళాలు సేకరించి, ప్రభుత్వ ప్రమేయం లేకుండా మణిపూర్ నుంచి నాగాలాండ్, అసోంలకు 'పీపుల్స్ రోడ్డు'ను నిర్మించాడు. ప్రతి శుక్రవారం ఆరు నుంచి పదో తరగతి చదువుతున్న పదిమంది విద్యార్థులను కలెక్టర్ ఆఫీసుకు ఆహ్వానించి జిల్లా యంత్రాంగం పని తీరును దగ్గరుండి చూసే అవకాశం కల్పిస్తున్నాడు. ఆ సాయంత్రం వారికి భోజనం కూడా ఏర్పాటుచేస్తున్నాడు. జిల్లాను ఎలా అభివృద్ధి చేయాలనే విషయంలోనూ విద్యార్థుల అభిప్రాయాలను తెలుసుకుంటున్నాడు. ఇలా విద్యార్థులను ఆహ్వానించడం వెనుక ఆసక్తికరమైన కథ ఉంది. ఆర్మ్‌స్ట్రాంగ్ చిన్నతనంలో డిప్యూటీ కమిషనర్ ఆఫీసుకు వెళ్లి అక్కడ జరిగే కార్యక్రమాలను స్వయంగా చూడాలని ఆశపడేవాడట. కానీ అక్కడి అధికారులు అతడిని లోపలికి అనుమతించలేదట. అందుకే కొత్త విషయాలను తెలుసుకోడానికి ఆసక్తిచూపించే వారిని నిరుత్సాహపరచకూడదనే ఉద్దేశంతో ఇలా విద్యార్థులను ఆహ్వానిస్తున్నాడట.

# లోపల...



**ఒక దేశం... ఒకే పన్ను!**

దేశవ్యాప్తంగా ఇప్పుడు చర్చంతా కొత్తగా అమలులోకి వచ్చిన వస్తు, సేవల పన్ను గురించే. జీఎస్టీ వల్ల దేశ ఆర్థిక వ్యవస్థలో సమూల మార్పులొస్తున్నాయని కేంద్ర ప్రభుత్వం చెబుతోంది. కానీ అందులో నిజమెంతో, అబద్ధమెంతో, జీఎస్టీ వల్ల లాభమెంతో, నష్టమెంతో తేల్చుకోవాల్సిన బాధ్యత మనదే. 7





# మీ మాట

ఈ సంచికపై మీ అభిప్రాయాలను sunday@eenadu.netకు మెయిల్ చేయవచ్చు.

### స్ఫూర్తిదాయకం

'ఐడియా కావాలి నాయనా' కథనం ఎంతో స్ఫూర్తిదాయకంగా ఉంది. పెద్ద పెద్ద సంస్థలు కూడా 'క్రౌడ్‌సోర్సింగ్' ద్వారా వినియోగదారుల ఆలోచనలను ఆహ్వానించడం శుభ పరిణామం. పాలనా వ్యవహారాల్లో 'క్రౌడ్‌సోర్సింగ్'ను భాగం చేయడం ద్వారా ప్రధాని మోదీ ప్రజలకు మరింత చేరువయ్యారనడంలో సందేహంలేదు.

*– బి.కమలాకర్, ఖమ్మం*

*– రామకృష్ణ(ఈమెయిల్)*

### కనువిప్పు

'లోపలి మనిషి' కథ ఆలోచింపజేసింది. క్షణికావేశంతో విచక్షణ కోల్పోయేవారికి కనువిప్పు కలిగించేలా ఉంది. యజమానిని దేవుడిలా భావించే పనిమనిషి కల్మషంలేని మనసును విశ్లేషించిన తీరు హృద్యంగా ఉంది.

*– మీనాక్షి కులకర్ణి, జెక్లేరు(మహబూబ్‌నగర్ జిల్లా)*

### ఉపయుక్తం

'కొత్తగా'లోని వస్తువులు ఆధునిక సాంకేతికతకు అద్దంపడుతూ ఉపయుక్తంగా ఉన్నాయి. సూప్‌లను తయారుచేసే సూప్ మేకర్లూ, దువ్వెనలూ ఆశ్చర్యపరిచాయి. పిల్లల స్పాలూ, సెలూన్లూ ఆకట్టుకున్నాయి. సియోల్‌లోని పాత వంతెనను పచ్చని పార్కులా మార్చడం బాగుంది. చివరి పేజీలోని లాంతర్ల ప్రవాహం కనువిందు చేసింది.

*– ఎల్.లలితాదేవి, వరంగల్*

### ప్రత్యేక గుర్తింపు

నటుడు ఆది పినిశెట్టి జీవితానుభవాలు ఆకట్టుకున్నాయి. హీరోగా నటిస్తూనే విలక్షణమైన పాత్రల్లో కనిపించడానికి ప్రాధాన్యమివ్వడం బాగుంది. తనకంటూ ప్రత్యేక గుర్తింపును తెచ్చుకున్న ఆది మరెన్నో విభిన్నమైన పాత్రల్లో కనిపించాలని కోరుకుంటున్నాం.

*– సీహెచ్.అభిజిత్, హైదరాబాద్*

### ఆశాజ్యోతి

అన్నార్తుల ఆకలి తీరుస్తోన్న భక్తి వేదాంత ఆశ్రమం గొప్పతనం గురించి ఎంత చెప్పినా తక్కువే. మానవసేవే మాధవసేవని నిరూపిస్తున్న ఈ ఆశ్రమం అన్నార్తుల పాలిట ఆశాజ్యోతే. వేద పాఠశాల ప్రాచీన గురుకులాలను గుర్తుచేసింది. మిగతా రెస్టారెంట్లకంటే భిన్నమైన వంటకాలతో సాగిపోతున్న గగన్ ఆనంద్ ప్రయాణం ఎంతో స్ఫూర్తిదాయకం.

*– మునగవల్సి జగన్మోహన్, విశాఖపట్నం*

*– పచ్చల కోటేశ్వరరావు, పెదగొట్టిపాడు(గుంటూరు జిల్లా)*

### ఆలోచింపజేశాయి

ప్రకృతి దృశ్యాలను ఫ్యాషన్‌గా మలచిన తీరు ఎంతో బాగుంది. ఆసియాలోనే నంబర్ వన్ షెఫ్‌గా పేరొందిన గగన్ ఆనంద్ జీవిత విశేషాలు ఆలోచింపజేశాయి. రొటీన్‌కు భిన్నంగా వంటకాలు చేయడం వల్లే ఆయన ఆ స్థాయికి చేరుకోగలిగాడు.

*– డాక్టర్ శివభూషణం, కర్నూలు*

**మంచిమాట**

ధనాన్ని చూసి దరిచేరే బంధువులు, అందాన్ని చూసి కలిగే ప్రేమ, అవసరం కోసం కలుపుకునే స్నేహం... ఎన్నటికీ శాశ్వతం కావు.

చిత్తూరు జిల్లా అనగానే తిరుమల వేంకటేశ్వర స్వామి, కాణిపాకం వినాయకుడు, శ్రీ కాళహస్తీశ్వర స్వామి... గుర్తొస్తారు. కానీ ఈ దేవుళ్ల తర్వాత స్థానికంగా అత్యధిక ఆదాయం కలిగిన శక్తి ఆలయం బోయకొండ గంగమ్మ తల్లిదే. గ్రామదేవతగా వెలసి కోర్కెలు తీర్చే కల్పవల్లిగా వెలుగొందుతోన్న ఈ అమ్మవారిని దర్శించేందుకు తెలుగు రాష్ట్రాలతో పాటు కర్ణాటక, తమిళనాడు నుంచీ భక్తులు వస్తుంటారు.

# పిలిచిన పలికే తల్లి... బోయకొండ గంగమ్మ!



అమ్మల గన్న అమ్మ శక్తి స్వరూపిణి... పిలిచినంతనే పలుకుతుందనీ తన భక్తుల్ని కష్టాలనుంచి గట్టెక్కిస్తుందనేది పురాణాల్లో ఉన్న మాటే. ఆ వాక్కుని నిజం చేస్తూ గిరిపుత్రుల ఆర్తనాదాలను విని బోయకొండ గంగమ్మ తల్లిగా దిగివచ్చింది ఆ తల్లి. ఆంధ్రప్రదేశ్, చిత్తూరు జిల్లాలోని చౌడేపల్లె మండలం, దిగువపల్లె గ్రామానికి దగ్గర్లో తూర్పు కొండల్లో ఉంది ఈ ఆలయం. కలకత్తా కాళీ మాత, విజయవాడ కనకదుర్గమ్మలకు ప్రతిరూపంగా కొలిచే ఇక్కడి అమ్మవారు క్రీ.శ 18వ శతాబ్దం నుంచే పూజలందుకుంటున్నట్లు ఆధారాలున్నాయి. ఆ సమయంలో గోల్కొండ నవాబుల కన్ను స్థానిక పుంగనూరు సంస్థాన పరిసర ప్రాంతాలపై పడింది. నవాబులు అక్కడికి చుట్టుపక్కల ఉన్న గ్రామాలపై సైన్యంతో దండెత్తి, దాడులు చేయడం మొదలుపెట్టారు. ఆ మార్గంలో చౌడేపల్లె అడవుల్లో గిరిజన జాతులవారైన బోయలూ ఏకిల దొరలు నివసించే గూడేల్లో ప్రవేశించి బీభత్సం సృష్టించారు. కనిపించిన ఆడ కూతుళ్లపై అత్యాచారానికి పాల్పడ్డారు. పౌరుషంతో అక్కడి మగవాళ్లు ఎదురు తిరగడంతో దాడిలో గ్రామస్థులతో పాటు నవాబు సైన్యంలోనూ చాలామంది ప్రాణాలు విడిచారు. సేన తగ్గేసరికి వెనుదిరిగిన నవాబులు తర్వాత మరింతమంది సైనికులతో ఆ ప్రాంతాన్ని ముట్టడించడానికి బయలుదేరారు. మాన ప్రాణాలను కాపాడుకోవడానికి బోయలకూ ఏకిల దొరలకూ పారిపోవడం తప్ప మరో దిక్కులేకుండా పోయింది.



దగ్గర్లోని కొండ గుట్టల్లో దాక్కుని తమను రక్షించమని అమ్మోరుతల్లిని వేడుకున్నారు. వారి మొర ఆలకించిన జగదంబ అవ్వ రూపంలో అక్కడికి వచ్చి గిరిపుత్రులకు ధైర్యం చెప్పిందట. వారి మీద దాడి చెయ్యడానికి వచ్చిన సైన్యాన్ని చూసి ఆ తల్లి ఉగ్రరూపం దాల్చి తన ఖడ్గంతో సేనలను హతమార్చడం ప్రారంభించిందనేది స్థలపురాణం. అమ్మవారి ఖడ్గదాటికి అక్కడున్న పెద్ద రాయి సైతం నిట్ట నిలువుగా చీలిపోయిందట. ఇప్పటికీ ఇక్కడి కొండపై రెండుగా చీలిన రాతి గుండు కనిపిస్తుంది. తమను రక్షించిన అమ్మవారిని తమతోనే ఉండమని ప్రార్థించారు గిరిజనులు. అలా బోయల కోరిక మేరకు వెలసిన ఆ జగజ్జనని 'బోయకొండ గంగమ్మ'గా పేరుగాంచింది.

## ప్రకృతి ఒడిలో...

ఎన్నో చిన్న చిన్న కొండలూ లోయలూ చిట్టడవులూ నీటి కొలనులతో ఉండే బోయకొండ ఆలయ ప్రాంతం ప్రకృతి రమణీయతకు నెలవు. నిత్యం భక్తులతో కిటకిటలాడే ఈ ఆలయం చిత్తూరు జిల్లాలో అధికాదాయం (ఏడాదికి రూ.ఆరు కోట్లకు పైనే) కలిగిన శక్తి ఆలయంగా పేరుగాంచింది. ఆది, మంగళ, గురువారాల్లో అయితే లక్షలాదిమంది భక్తులు అమ్మవారిని దర్శించుకునేందుకు వివిధ ప్రాంతాల నుంచి వస్తుంటారు. ఈ గుడిని చేరుకోవాలంటే మూడు కొండలు ఎక్కాలి. 250 మీటర్ల ఎత్తులో ఉండే మొదటి కొండను ఎక్కి పైకెళ్తే రెండో కొండలో రణ భేరమ్మ (రౌద్రాకారంలో ఉన్న గంగమ్మ) ఆలయం ఉంటుంది. భక్తులు తమ తొలి పూజను ఇక్కడే చేస్తారు. మూడో కొండపై ప్రధాన ఆలయం ఉంటుంది. ఇక్కడి నాలుగంతస్తుల గోపురం అష్ట దిక్పాలకులతో అనేక చిత్ర భంగిమలతో అలరారుతోంది. స్వయంగా గంగమ్మ తల్లి సృష్టించిందిగా చెప్పే ఇక్కడి పుష్కరిణిలోని తీర్థాన్ని సేవిస్తే రోగాలు మటుమాయం అవుతాయనీ పంటలపై చిలకరిస్తే చీడలు తొలగుతాయనీ నమ్ముతారు. అందుకే, దేవస్థానం ఈ నీటిని లీటరు రూ.10 చొప్పున అమ్ముతోంది. ఆలయానికి దగ్గర్లో పాతకాలం నాటి రాతి కోట, బురుజుల ఆనవాళ్లూ కనిపిస్తాయి. బోయకొండ గంగమ్మ తల్లి అంటే స్థానికులకు ఎంత నమ్మకం అంటే చుట్టుపక్కల ఉన్న దాదాపు 250 గ్రామాల్లో ఈ తల్లికి ఆలయాలను నిర్మించుకున్నారు.

## నవరాత్రులు ఇక్కడ ప్రత్యేకం

ఆదిపరాశక్తిగా కొలిచే బోయకొండ అమ్మవారికి ఏటా దసరా సమయంలో వార్షిక మహోత్సవాలను నిర్వహిస్తారు. వీటిని నవరాత్రి ఉత్సవాలుగానూ పిలుస్తారు. ఈ సమయంలో గంగమ్మతల్లిని బాలా త్రిపుర సుందరీదేవి, ధనలక్ష్మి, రాజరాజేశ్వరీ దేవి, మహాలక్ష్మి, కాళీ మాత, పార్వతీ దేవి, సరస్వతి, శాకాంబరి, మహిషాసుర మర్దిని, చండీమాత, విజయలక్ష్మి... ఇలా రోజుకో అమ్మవారి రూపంలో పదకొండు రకాలుగా అలంకరిస్తారు. సరస్వతీ దేవి అలంకారం రోజున ఎంతోమంది భక్తులు ఇక్కడికి వచ్చి పిల్లలకు అక్షరాభ్యాసం చేయిస్తారు. అలా చేస్తే తమ పిల్లలు విద్యావంతులవుతారనేది భక్తుల నమ్మకం. దుర్గాష్టమి రోజున మహిషాసురమర్దిని అలంకారంలో ఉన్న అమ్మవారిని దర్శించి ప్రత్యేక పూజలు చేస్తే కుటుంబ కలహాలూ ఇతర బాధలు దూరమవుతాయనేది మరో నమ్మకం.

పుంగనూరు, మదనపల్లె పట్టణాల నుంచి 21 కిలోమీటర్ల దూరంలో ఉన్న ఈ ఆలయానికి అక్కణ్నుంచి బస్సు సౌకర్యం ఉంది.

– కరీముల్లా షేక్, ఈనాడు, చిత్తూరు

ఫొటోలు: కవరకుంట్ల శంకరయ్య

# జ్వరబాధితులకో పొట్లకాయ!

**వి**టమిన్-ఎ, బి, సిలతోబాటు మెగ్నీషియం, కాల్షియం, ఫాస్ఫరస్... వంటి ఖనిజాలు పుష్కలంగా ఉన్న పొట్లకాయ



ఎముక ఆరోగ్యానికీ దంత సంరక్షణకీ ఎంతో మంచిదన్నది తెలిసిందే. అంతే కాదు, పొట్లకాయ అనేక వ్యాధుల నివారణకీ దోహదపడుతుంది. వాంతులూ విరేచనాలతో కూడిన జ్వర నివారణకి పొట్లకాయ మంచి ఔషధంగా పనిచేస్తుందని సంప్రదాయవైద్యం పేర్కొంటోంది. మలేరియా జ్వర బాధితులకి పొట్లకాయ రసం మంచి మందు. ఇది యాంటీబయోటిక్‌గానూ పనిచేస్తుందని అనేక ఆధునిక పరిశోధనల్లోనూ తేలింది.

★ చైనా సంప్రదాయ వైద్యం ప్రకారం- మధుమేహానికి పొట్లకాయ అద్భుత ఔషధంలా పనిచేస్తుందట. పైగా క్యాలరీలు కూడా తక్కువ కావడంతో బరువూ తగ్గుతారు. ఇందులోని పీచు మలబద్ధకాన్నీ తగ్గిస్తుంది. రక్త ప్రసరణ సాఫీగా జరగడానికి కూడా పొట్లకాయ తోడ్పడుతుంది. అందుకే దీన్నుంచి తీసిన రసం రోజూ రెండు కప్పులు తాగితే హృద్రోగ సమస్యలు తగ్గుతాయట. బీపీనీ తగ్గిస్తుంది.

★ పొట్లకాయ శరీరంలోని టాక్సిన్లను సమర్థంగా తొలగిస్తుంది. మూత్రపిండాలూ, మూత్రాశయం పనితీరునీ మెరుగుపరుస్తుంది.

★ గొంతులోని కఫాన్ని తగ్గించడంతోబాటు శ్వాసవ్యవస్థ పనితీరుకీ దోహదపడుతుంది.

★ పొట్లకాయ రసాన్ని తలకి పట్టించి ఓ అరగంట తరవాత స్నానం చేస్తే తలలోని చుండ్రు తగ్గుతుంది.




# పిల్లల్లో నిద్ర తగ్గితే...

**ఈ**మధ్యకాలంలో పిల్లల నిద్రవేళల్లో మార్పు కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది. పగలంతా చదువూ రాత్రివేళల్లో స్మార్ట్‌ఫోన్లూ టీవీలతో కాలక్షేపం... ఫలితం... నిద్రించే సమయం బాగా తగ్గిపోతోంది. అయినా వాళ్లు చలాకీగానే ఉన్నారులే అని వదిలేస్తే భవిష్యత్తులో ఆరోగ్యసమస్యల్ని ఎదుర్కోక తప్పదు అని హెచ్చరిస్తున్నారు ప్రిన్స్‌టన్ విశ్వవిద్యాలయ నిపుణులు. ముఖ్యంగా నిద్ర సరిపోని పిల్లల్లో శరీరంలో కణాల వయసు తగ్గిపోతుందట. సాధారణంగా క్రోమోజోముల అంచుల్లోని టెలోమర్ల పొడవు, ఆ వ్యక్తి వయసుకి అద్దం పడుతుంటుంది. వయసు పెరిగే కొద్దీ వాటి పొడవు కుంచించుకుపోతుంది. దీని ఆధారంగా సరిగ్గా నిద్రపోని పిల్లల టెలోమర్లను పరిశీలించగా- వాటి పొడవు ప్రతీ గంట నిద్రలేమికీ 1.5 శాతం తగ్గిపోతున్నట్లు గుర్తించారు. ఫలితంగా మున్ముందు వాళ్లలో క్యాన్సర్లు, హృద్రోగాలు, తెలివితేటలు క్షీణించడం... వంటివి చోటు చేసుకుంటాయని చెబుతున్నారు. కాబట్టి తల్లితండ్రులూ జాగ్రత్త.



# మహిళలూ ఇవి తింటున్నారా?

**ప్ర**పంచవ్యాప్తంగా అనేకమంది మహిళలు 45 ఏళ్ల వయసుకన్నా ముందే మెనోపాజ్‌కు దగ్గరవుతున్నారు. ఫలితంగా ఆస్టియోపొరోసిస్, హృద్రోగాలు... వంటి వాటికీ గురవుతున్నారు. అలా జరగకుండా ఉండాలంటే మహిళలు ముందు నుంచీ శాకాహార ప్రొటీన్లను ఆహారంలో భాగంగా చేసుకుంటే మంచిదని యూనివర్శిటీ ఆఫ్ మాసాచుసెట్స్‌కు చెందిన నిపుణులు పేర్కొంటున్నారు. ఇందుకోసం సదరు నిపుణులు 25-42 ఏళ్ల మధ్యలోని లక్షా పదహారు వేల మహిళల్ని ఎంపికచేసి పరిశీలించగా- వాళ్లు తీసుకునే ఆహారానికీ ముందుగానే మెనోపాజ్‌కి గురవడానికీ కారణం ఉంది అని తేలింది. అందుకే మహిళలు రోజువారీ తీసుకునే రెండు వేల క్యాలరీల ఆహారంలో 6.5 శాతం శాకాహార ప్రొటీన్ ఉండేలా తీసుకుంటే ఆ సమస్య నుంచి తప్పించుకోవచ్చు అంటున్నారు. అంటే ప్రతిరోజూ సుమారు 30 గ్రా. సోయా లేదా ఇతరత్రా నట్స్ ద్వారా వచ్చే ప్రొటీన్ ఆరోగ్యానికి మేలు చేస్తుంది అంటూ వివరిస్తున్నారు.





## ప్లాస్టర్‌తోనే సూదిమందు!

**ఫ్లూ** జ్వరాలతోబాటు కొన్ని రకాల వ్యాధుల నివారణకోసం వ్యాక్సీన్లను ఇంజెక్షన్ల రూపంలో ఇవ్వడం తప్పనిసరి. కానీ చాలామందికి సూదంటే ఉన్న భయం కారణంగా ఆ వ్యాక్సీన్‌ను వేయించుకోవడానికి ఇష్టపడరు. అందుకే ఎమోరీ, జార్జియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీకి చెందిన నిపుణులు, నొప్పి కలిగించని ప్లాస్టర్ ఇంజెక్షన్‌ని రూపొందించారు. అదెలా అంటే- ప్యాచ్‌లా ఉండే దీనికి సన్నని సూదులు అతుక్కుని ఉంటాయి. ప్యాచ్‌ను చర్మంమీద పెట్టి కొద్దిగా వత్తితే దానికున్న మైక్రో నీడిల్స్ ద్వారా అందులోని మందు రక్తంలోకి వెళుతుంది. వెంట్రుక కన్నా సన్నగా ఉండే ఈ సూదులు ఏమాత్రం నొప్పిని కలిగించవు సరికదా, వాడేసిన తరవాత చెత్తబుట్టలో వేసేస్తే ప్యాచ్‌కు అతుక్కున్న నీడిల్స్ వాటంతటవే కరిగిపోతాయి. పైగా ఈ ప్యాచ్‌లు వాడుకలోకి వస్తే వ్యాక్సీన్‌కోసం హాస్పిటల్‌కి వెళ్లాల్సిన పని లేదు, ఎవరికి వాళ్లు ఇంట్లోనే వేసుకోవచ్చు. వీటిని ఏడాది వరకూ ఫ్రిజ్‌లోనూ నిల్వ ఉంచవచ్చు. కాబట్టి అభివృద్ధి చెందుతోన్న దేశాల్లో వ్యాక్సీన్ల ప్రక్రియను మరింత సమర్థంగా నిర్వహించడానికి ఈ ప్యాచ్‌లు ఎంతయినా దోహదపడతాయని చెప్పవచ్చు.



## టూకీగా...

**పి**ల్లల్లో భాషా పరిజ్ఞానం పెరగాలంటే ఎలక్ట్రానిక్ బొమ్మల్ని కొనివ్వడం కన్నా వాళ్లతో తలిదండ్రులు కాసేపు ఆడుకోవడంతోబాటు చెక్కబొమ్మలూ బ్లాకులూ పుస్తకాలూ పజిల్సులాంటి ఇవ్వడమే మేలని అమెరికన్ పరిశోధకులు పేర్కొంటున్నారు.

★ మధుమేహం, నిద్రలేమి... రెండు సమస్యలతోనూ బాధపడే వాళ్లకి ఇతర మధుమేహ బాధితుల కన్నా త్వరగా కంటిచూపు తగ్గిపోయే అవకాశం ఉందని బర్మింగ్‌హామ్ విశ్వవిద్యాలయ నిపుణుల పరిశీలనలో తేలింది.



జీఎస్‌టీ... ఈ కొత్త పన్ను విధానం అర్థమైతే మంచిది.
భవిష్యత్తులో మనపైన దాని ప్రభావాన్నీ అర్థం చేసుకోగలిగితే మరీ మంచిది.
దేశంలో అతిపెద్ద ఆర్థిక విప్లవం వస్తు, సేవల పన్ను అమలుతో మొదలైందని ప్రధాని అన్నారు.
అవినీతినీ, నల్లధనాన్నీ నిరోధించి సామాన్యులకు మేలు చేయాలనే
ఈ కొత్త పన్ను విధానాన్ని తీసుకొచ్చామని ఆర్థికమంత్రి అంటున్నారు.
ఎవరేం చెప్పినా ఆ పన్ను లోటుపాట్లేంటో తెలుసుకొని
లాభ నష్టాలను బేరీజు వేసుకోవాల్సిన బాధ్యత మాత్రం మనదే.

# ఒకే దేశం... ఒకే పన్ను!

సృష్టిలో అర్థం కానివి మూడే మూడు. ఒకటి అమ్మాయి, రెండు క్రికెట్లో డక్‌వర్త్ లూయిస్ విధానం, మూడు జీఎస్‌టీ... అంటారు ఒకరు.

పెళ్లికాకముందు అమ్మకీ, నాన్నకీ, తమ్ముడికీ, తాతయ్యకీ- ఇలా అడిగినవాళ్లందరికీ డబ్బులిస్తుంటాం. అదే పెళ్లయ్యాక(జీఎస్‌టీ వచ్చాక) డబ్బంతా భార్య చేతిలో పెడితే చాలు, ఇంకెవ్వరూ మనల్ని డబ్బులడగరు... అని వస్తు సేవల పన్నుకి సులువైన నిర్వచనం ఇస్తారు ఇంకొకరు.

ఇక్కడ రెండు ఉదాహరణలూ సరైనవే. చూసే కోణాన్ని బట్టే జీఎస్‌టీ రూపం మారుతుంది. ఒక్క మాటలో చెప్పాలంటే భారత దేశం ఒక్కటే కాబట్టి, దేశవ్యాప్తంగా ఒకే పన్ను విధానం ఉండాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఆ పన్నే జీఎస్‌టీ. అందులో 0, 5, 12, 18, 28శాతాలంటూ రకరకాల శ్లాబులు విధించింది. అదీ సామాన్యుల మంచికోసమే. 'హవాయి చెప్పులకీ బెంజి కారుకీ ఒకే పన్ను వేయడం సరికాదు కదా' అంటారు ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ. కాకపోతే ఆ వేర్వేరు పన్ను శాతాలే సామాన్యులకు చిక్కుముళ్లలా కనిపిస్తున్నాయి. జీఎస్‌టీ అమలయ్యాక కొన్ని వస్తువుల ధరలు పెరిగాయి, ఇంకొన్ని తగ్గాయి. ఇప్పుడు పెరిగిన ధరలూ భవిష్యత్తులో తగ్గడం ఖాయమని ఆర్థిక మంత్రి అభయమిస్తున్నారు. అసలీ గందరగోళమంతా ఎందుకు... జీఎస్‌టీ పూర్తి స్వరూపమేంటో తెలుసుకుంటే, అది మంచో చెడో, లాభమో నష్టమో మనమే అర్థం చేసుకోవచ్చు.



## జీఎస్‌టీ అంటే?

దేశానికి స్వాతంత్ర్యం రాకముందూ పన్నులు కట్టాం. ఇప్పటికీ కడుతూనే ఉన్నాం. రోజులు గడిచేకొద్దీ ఆ పన్నులు పెరుగుతూనే ఉన్నాయి కానీ తగ్గట్లేదు. పాత పన్నుల విధానంలో మార్పుచేర్పులు చేస్తూ పన్నెండేళ్ల క్రితం అన్ని వస్తువులపైనా 'వ్యాట్' (విలువ ఆధారిత పన్ను) అనే కొత్త పన్నుని కేంద్ర ప్రభుత్వం తీసుకొచ్చింది. దాన్ని అన్ని రాష్ట్రాలూ విజయవంతంగా అమలు చేస్తూ వచ్చాయి. కానీ అందులోనూ ఎన్నో లొసుగులు. అమలుతీరులోనూ ఎన్నో లోపాలు. 125కోట్ల మంది భారతీయులుంటే, అందులో 1.9కోట్లు- అంటే కేవలం 1.5శాతం మాత్రమే ప్రభుత్వానికి ఆదాయ పన్ను కడుతున్నారు. తమకు ఏడాదికి పదిలక్షలకు పైగా సంపాదన ఉందని చెబుతున్న వారి సంఖ్య 24లక్షలు. కానీ ఏటా ఇరవై ఐదు లక్షలకు పైగా కార్లు దేశంలో అమ్ముడవుతున్నాయి. మన చుట్టూ ఉన్న పెద్ద అపార్టుమెంట్లూ, భవనాలూ, విల్లాల్లాంటివన్నీ ఆ అంకెలు అబద్ధమని చెప్పకనే చెబుతున్నాయి. ఆ పరిస్థితి మారాలంటే, అర్హులైన వాళ్లందరి నుంచీ పన్నులు వసూలు చేయాలి. అంటే ఇప్పుడున్న విధానం మారి పటిష్ఠమైన మరో కొత్త విధానం అమల్లోకి రావాలి. దానికోసం ఎన్నో ఏళ్లుగా ప్రభుత్వ పెద్దలూ, ఆర్థిక నిపుణులూ సాగించిన మేధోమథనం నుంచి పుట్టిన కొత్త పన్నుల విధానమే జీఎస్‌టీ.

సేల్స్ టాక్స్, సర్వీస్ టాక్స్, సెంట్రల్ ఎక్సైజ్ డ్యూటీ, ఎంట్రీ టాక్స్, పర్చేజ్ టాక్స్ అంటూ నిన్నమొన్నటిదాకా దాదాపు పదిహేనుకి పైగా పన్నులు ఉండేవి. ఇప్పుడు అవన్నీ రద్దయి, వాటి స్థానంలో జీఎస్‌టీ ఒక్కటే వచ్చి చేరింది. దీని వల్ల దేశవ్యాప్తంగా ఒకే పన్ను విధానం అమలవుతుంది. వస్తువు ఒక్కటే అయినా, గతంలో రాష్ట్రాలకు తమకు అనువుగా వాటిపైన ప్రత్యేక పన్నులు వేసుకునే అవకాశం ఉండేది. ప్రత్యేక సందర్భాల్లో పన్ను రాయితీలు కల్పించేవి. కానీ జీఎస్‌టీ అమలుతో రాష్ట్రాలకున్న ఆ వెసులుబాట్లన్నీ తొలగిపోయాయి. హిమాచల్ ప్రదేశ్ నుంచీ కేరళ తీరం వరకూ ఇప్పుడు ప్రతి వస్తువుకీ ఎక్కడైనా ఒకే శ్లాబులో పన్ను పడుతుంది. పైకి కనిపించని పన్నుల బాదుడు లేకుండా ఎవరైనా జీఎస్‌టీ ఒకటి కడితే సరిపోతుంది.

## ఎవరికి లాభం?

జీఎస్‌టీ వల్ల సామాన్యుడి నుంచి కార్పొరేట్ సంస్థల వరకూ అందరికీ ఎంతోకొంత లాభమేనని ప్రభుత్వం చెబుతోంది.

**సామాన్యులకు:** బియ్యం, పాలూ, గుడ్లూ, ఉప్పూ, కూరగాయలూ, విడి గోధుమపిండీ, మైదాపిండీ లాంటి అనేక నిత్యావసరాలు సున్నా శాతం పన్ను జాబితాలోకి చేరాయి.



# GST

టీపొడి, పంచదార, నూనెలు, జీడిపప్పు లాంటివి ఐదు శాతం, సెల్ ఫోన్లు, పచ్చళ్లు, వెన్న, నెయ్యి లాంటివి 12 శాతం పన్ను పరిధిలోకి వచ్చాయి. మొత్తంగా రోజువారీ జీవితంలో ఉపయోగపడే వస్తువుల్లో 81శాతం సున్నా నుంచి 18శాతం లోపు పన్ను పరిధిలోకే వస్తున్నాయి. అందులోనూ నిత్యావసరాలపై పన్ను మరింత తగ్గింది. ఇది పేద, దిగువ మధ్యతరగతి వాళ్లకు లాభదాయకం. మధుమేహం, క్యాన్సర్‌లాంటి అనేక దీర్ఘకాలిక వ్యాధులకు సంబంధించిన ఔషధాల ధరలూ తగ్గాయి. పన్ను ప్రయోజనాల వల్ల వచ్చే లాభాన్ని గతంలో సంస్థలు వినియోగదార్లకు అందించేవి కావు. కానీ ఇప్పట్నుంచీ కచ్చితంగా ఆ మిగులు ఆధారంగా వస్తువుల ధరల్ని తగ్గిస్తున్నారో లేదో చూడటానికి 'యాంటీ ప్రాఫిటీరింగ్' కమిటీ పనిచేస్తుంది. అలా ధరలు తగ్గించని సంస్థల లైసెన్సును రద్దు చేసే హక్కు ఈ కమిటీకి ఉంది. కాబట్టి భవిష్యత్తులో మరిన్ని వస్తువుల ధరలు తగ్గే అవకాశమూ ఉంది.

**సంస్థలకు:** గతంలో ఒక వస్తువు తయారీకి వంద రూపాయలు ఖర్చయింది అనుకుంటే, దానిపైన పది శాతం చొప్పున పన్ను చెల్లించి డీలర్‌కి అమ్మితే దాని ధర రూ.110 అయ్యేది. ఆ డీలర్ మరో పదిశాతం చెల్లించి రూ.121కి స్థానిక డిస్ట్రిబ్యూటర్‌కీ, అతడు ఇంకో పదిశాతం చెల్లించి దాదాపు రూ.133కి దుకాణదారుడికి అమ్మేవాడు. అంటే ఇక్కడ ఒకసారి పన్ను కట్టిన వస్తువుకే వివిధ దశల్లో మళ్లీ పన్ను కట్టాల్సివస్తుంది. కానీ జీఎస్‌టీ రాకతో ఆ విధానం మారిపోయింది. కొత్తగా వ్యాపారులకు 'ఇన్‌పుట్ క్రెడిట్' లభించనుంది. అంటే ఒక వ్యాపారి దగ్గర వంద రూపాయలకి ఓ వస్తువుని కొని దాన్ని రూ.150కి తిరిగి అమ్మితే, రెండో వ్యాపారి ఆపైన యాభై రూపాయలకు పన్ను కడితే సరిపోతుంది. తక్కిన వందకు మొదటి వ్యాపారే పన్ను కడతాడు. ఈ 'ఇన్‌పుట్ క్రెడిట్' పన్ను చెల్లింపుల్ని ప్రోత్సహిస్తుంది. దీనివల్ల సంస్థలకు ఉత్పత్తి వ్యయం తగ్గుతుంది.

**రాష్ట్రాలకు:** జీఎస్‌టీకి ముందు ఒక వస్తువు ఏ ప్రాంతంలో తయారయ్యేదో, పన్ను వసూలు కూడా ఆ రాష్ట్రం నుంచే (ఆరిజన్ బేస్డ్) మొదలయ్యేది. కానీ కొత్త వస్తు, సేవల పన్ను విధానంలో ఆ పద్ధతి మారిపోయింది. ఇప్పుడు తయారైన వస్తువు చివరిగా ఏ ప్రాంతంలో వినియోగమవుతుందో, ఆ రాష్ట్రానికే (డెస్టినేషన్ బేస్డ్) దాని తాలూకు పన్ను దక్కుతుంది. అంటే ఎక్కువ కొనుగోలు శక్తి కలిగిన రాష్ట్రాలకు పన్నులు ఎక్కువగా వచ్చే అవకాశం ఉంది. మరోపక్క గతంలో వేర్వేరు రాష్ట్రాల మధ్య సరకు రవాణాకి పన్నులు ఎక్కువగా ఉండటంతో చిన్నరాష్ట్రాలు ఇతర ప్రాంతాలకు తమ ఉత్పత్తుల్ని పంపించడానికి వెనకడుగు వేసేవి. కానీ ఇప్పుడు దేశమంతా ఒకే మార్కెట్‌గా మారి, పన్నుల భారం తగ్గడంతో వెనకబడిన రాష్ట్రాల ఉత్పత్తులూ దేశవ్యాప్తంగా అందుబాటులోకి రానున్నాయి.

## ఎవరికి భారం?

దేశంలో ఎగువ మధ్యతరగతి ప్రజలూ, సంపన్నుల సంఖ్య క్రమంగా పెరుగుతోంది. దాంతో పాటే వాళ్ల జీవనశైలీ మారుతోంది. జీఎస్టీ రాకతో ఆ ఖరీదైన జీవితం ఇంకాస్త భారం కానుంది. ఎయిర్ కండిషనర్లూ, ఫ్రిజ్‌లూ, వాషింగ్ మెషీన్లూ, వాచ్‌లూ, లెదర్ బ్యాగ్‌ల లాంటివి మరింత ప్రియం కానున్నాయి. వ్యాపారికి లాభం వచ్చినా రాకపోయినా, మార్కెట్‌లోకి వచ్చే ప్రతి వస్తువుపైనా పన్ను చెల్లించాలన్నది కొత్త నిబంధన. కాబట్టి ఇకపైన ఉచిత ఆఫర్లు కనిపించకపోవచ్చు. ఎందుకంటే వ్యాపారి ఏదైనా వస్తువుని వినియోగదార్లకి ఉచితంగా ఇచ్చినా, దానికి జీఎస్‌టీని మాత్రం వ్యాపారి ప్రభుత్వానికి చెల్లించాల్సిందే.

**చిన్న వ్యాపారులు:** ఫర్నిచర్, వస్త్రాలూ, గ్రానైట్ లాంటివాటిపైన 28శాతం జీఎస్‌టీ చెల్లించాల్సి వస్తోంది. దీనివల్ల ఆయా ఉత్పత్తుల ధరలు పెరుగుతాయి. ఫలితంగా వినియోగదార్ల సంఖ్య తగ్గుతుంది. దానివల్ల వ్యాపారులు నష్టపోవాల్సి వస్తుందన్నది చాలామంది ఆందోళన. మరోపక్క 20లక్షల రూపాయలకు పైగా వార్షిక టర్నోవరు ఉన్న వ్యాపారులంతా జీఎస్‌టీలో నమోదు చేసుకోవాలన్నది కొత్త నిబంధన. అంటే చిన్నస్థాయి వ్యాపారులకు ఆ అవసరం లేదు. కాకపోతే ఇక్కడే మరో మెలిక కూడా కనిపిస్తుంది. జీఎస్‌టీ కింద నమోదు చేసుకున్న సంస్థలు, మరో జీఎస్‌టీ నమోదిత సంస్థ నుంచి ఏవైనా వస్తువులు కొన్నప్పుడు మాత్రమే దానికి కొన్ని ప్రయోజనాలు దక్కుతాయి. అంటే 'ఎ' అనే వ్యక్తి నుంచి 'బి' అనే వ్యక్తి ఏదైనా వస్తువు కొంటే దానికి సంబంధించిన పన్నులను 'ఎ' నేరుగా ప్రభుత్వానికి జమ చేయాలి. కానీ 'ఎ' అనే వ్యక్తిది రిజిస్టర్డ్ సంస్థ కాకపోతే, అప్పుడు ఆ పన్నుని 'బి' అనే వ్యక్తి ప్రభుత్వానికి చెల్లించాల్సి వస్తుంది. దీని వల్ల కొనేవాళ్లకి శ్రమ పెరుగుతుంది. మానవ వనరుల వినియోగం ఎక్కువవుతుంది. అందుకే కొత్తగా వచ్చిన ఈ 'రివర్స్ ఛార్జ్' అనే నిబంధన కారణంగా జీఎస్‌టీ నమోదిత సంస్థల మధ్యనే వ్యాపార కార్యకలాపాలు జరిగే అవకాశం ఎక్కువగా ఉంది. దాంతో జీఎస్‌టీ పరిధిలోకి రాని వేలాది చిన్న వ్యాపారులు నష్టపోయే








ప్రమాదం ఉంటుంది. అంటే ప్రతి ఒక్కరూ జీఎస్‌టీ కింద నమోదు చేసుకోవాలని కొత్త నిబంధనలు పరోక్షంగా సూచిస్తున్నాయి.

**బహుళజాతి సంస్థలు:** ఇప్పటిదాకా గూగుల్, మైక్రోసాఫ్ట్ లాంటి అనేక బహుళ జాతి సంస్థలు భారత్ నుంచి పొందే అనేక రకాల సమాచార సేవలపైన ఎలాంటి పన్నులూ లేకుండానే లాభాలు గడిస్తున్నాయి. ఈ-కామర్స్ సంస్థలు కూడా డెలివరీ ఛార్జీల లాంటి కొన్ని సేవల ద్వారా పొందే ఆదాయం పైన పన్నులు చెల్లించట్లేదు. ఇప్పుడు ఇలాంటి సేవలన్నీ జీఎస్‌టీ పరిధిలోకే వచ్చాయి. భారత్ నుంచి సేవలు పొందే ప్రతి సంస్థా జీఎస్‌టీ కింద తప్పనిసరిగా నమోదు చేసుకొని పన్నులు చెల్లించాలన్నది కొత్త నిబంధన. దీని వల్ల ఐటీ రంగంపైన గతంతో పోలిస్తే ఎక్కువ పన్ను భారం పడుతుంది.

## నల్లధనం తగ్గుతుందా?

జీఎస్‌టీ పక్కాగా అమలైతే దాని వల్ల నల్ల ధనం ఎంతోకొంత తగ్గే అవకాశం ఉందన్నది చాలామంది ఆర్థిక విశ్లేషకుల అంచనా.

**చెక్‌పోస్టుల దందా:** సరకులతో నిండిన లారీ ఒక రాష్ట్రం నుంచి మరో రాష్ట్రానికి వచ్చే సమయంలో ప్రవేశ రుసుం (ఎంట్రీ టాక్స్) పేరుతో గతంలో కొంత పన్ను వసూలు చేసేవారు. కానీ అక్కడ అధికారిక పన్నుల కంటే అనధికార వసూళ్ల దందానే ఎక్కువగా నడిచేది. పూర్తిగా పన్ను కట్టకుండా తనిఖీ అధికారుల చేతుల్లో ఎంతో కొంత పెట్టేసి డ్రైవర్లు గుట్టుగా సరిహద్దులు దాటేసేవారు. అలా ఏటా వేల కోట్ల రూపాయల అక్రమ దందా నడుస్తోందని అంచనా. తనిఖీ అధికారి ఉద్యోగం కోసం జరిగే పైర వీలూ, చేతులు మారే లంచాలు కూడా అన్నీ ఇన్నీ కావు. జీఎస్‌టీ రాకతో ఒక్క దెబ్బతో ఆ అవినీతి రాజ్యం భూస్థాపితమైంది. ఎంట్రీ ట్యాక్స్‌లను పూర్తిగా ఎత్తేయడంతో సరిహద్దుల దగ్గర చెక్‌పోస్టులనీ తొలగించారు. నల్లధ నంపై జీఎస్‌టీ నేరుగా చేసిన దాడి ఇది. ఈ చెక్‌పోస్టుల వల్ల హైవేలపైన లారీలు గంటల తరబడి వేచి చూడాల్సి వచ్చేది. దాంతో దేశంలో సరకు రవాణా లారీలు రోజుకి సగటున 260కి.మీ.లే ప్రయాణిస్తున్నాయి. అమెరికాలో ఆ దూరం రోజుకి 800కి.మీ. జీఎస్‌టీ వల్ల ఇక్కడా ఆ సగటు పెరుగుతుంది.

**పన్నుల పండగ:** గతంలో చాలామంది వ్యాపారులు తమ లావాదేవీల్ని కాగితాలపైనే నమోదు చేసేవారు. దాంతో పన్ను చెల్లింపు సమయంలో వాటిని తమకు అనువుగా మార్చుకోవడం, కొన్ని బిల్లుల్ని దాచేయడం లాంటి పనుల ద్వారా లాభపడే అవకాశం ఉండేది. నిన్నమొన్నటి దాకా నగదు లావా దేవీలు ఎక్కువగా జరిగేవి కాబట్టి, వాటిని పన్నులెక్కల నుంచి తప్పించడం కూడా సులువుగా ఉండేది. కానీ జీఎస్‌టీ రాకతో పన్ను రిటర్నుల నిర్వహణంతా పూర్తిగా ఆన్‌లైన్ ద్వారానే జరగాలనీ, ఎక్కడా కాగితాన్ని ఉపయోగించకూడదనీ కొత్త నిబంధన వచ్చింది. దీని వల్ల జీఎస్‌టీలో నమోదు చేసుకున్న ఏ వ్యాపారీ పన్నుల నుంచి తప్పించుకోలేడు. అదెలాగంటే... ఒక వస్తువు తయారీ నుంచి వినియోగదారుడి వరకూ వచ్చే మధ్యలో ఒక ఐదుగురి చేతులు మారిందనుకుందాం. అందులో తొలి వ్యక్తి సరిగ్గా పన్ను చెల్లిస్తే, రెండో వ్యక్తికి పన్నులో మినహాయింపు లభిస్తుంది. రెండో వ్యక్తి చెల్లిస్తేనే మూడు, మూడో వ్యక్తి నుంచి నాలుగు... ఇలా ఒకరికి దక్కే పన్ను ప్రయోజనాలు మరో వ్యక్తి పన్ను చెల్లింపులపైన ఆధారపడి ఉంటాయి. దాంతో ఈ లంకెలో ఏ కాస్త తేడా వచ్చినా, అవకతవకలు వెంటనే బయట పడతాయి. కాబట్టి జీఎస్టీ పరిధిలో ఉన్న పన్నుల్ని ఎగ్గొట్టడం అంత సులువు కాక పోవచ్చు. ఆ సానుకూల ప్రభావం దేశ ఖజానాపైనా కనిపిస్తుంది.

మరోపక్క పన్ను చెల్లింపుదార్లకు ఎన్నడూ లేనన్ని రాయితీలూ, ప్రయోజనాలను జీఎస్‌టీ బిల్లు కల్పిస్తోంది. దాంతో కొత్తగా లక్షలాది వ్యాపారులు తమ సంస్థలను రిజిస్టర్ చేసుకుంటున్నారు. జీఎస్‌టీ పరిధిలోకి వచ్చే ప్రతి వ్యాపారికీ 'జీఎస్‌టీ కంప్లయిన్స్ రేటింగ్'ని అందిస్తున్నారు. దాన్ని ఎప్పటికప్పుడు ఆన్‌లైన్‌లో సరిచూసుకోవచ్చు. దాని ఆధారంగా ఫలానా సంస్థతో వ్యాపార లావాదేవీలు జరపాలా వద్దా అని నిర్ణయించుకోవచ్చు. ఎవరికి వారు తమ రేటింగ్ పెంచుకోవాలని చూస్తారు కాబట్టి, దీని ఫలితంగా రాబోయే రోజుల్లో నల్లధనం తగ్గి పన్నులు పెరిగే అవకాశాలు పుష్కలం.

## జీడీపీ పెరుగుతుందా?

మన స్థూల జాతీయోత్పత్తి (జీడీపీ)లో పన్నుల వాటా పదహారు శాతమే. చైనా, రష్యా, బ్రెజిల్‌లాంటి దేశాల్లో ఆ వాటా చాలా ఎక్కువగా ఉంది. నల్లధనం తగ్గి, పన్నుల వసూళ్లు పెరిగితే ప్రభుత్వ ఖజానా కళకళలాడుతుంది. ఫలితంగా జీడీపీలో పన్నుల వాటా దానంతటదే పెరుగుతుంది. దాంతోపాటూ స్థూల జాతీయోత్పత్తీ పెరుగుతుంది. అభివృద్ధి పథకాలకి నిధుల కోసం వెతుక్కోవాల్సిన అవసరమూ ఉండదు. జీఎస్‌టీని అమలు చేయడం ద్వారా రాబోయే రోజుల్లో భారత జీడీపీ వృద్ధి చెందడం ఖాయమని అంతర్జాతీయ ద్రవ్య నిధి నివేదికతో పాటు అనేక సంస్థల అంచనాలు స్పష్టం చేస్తున్నాయి.

## మన దగ్గర ఎందుకు ఎక్కువ?

కెనడాలో ఐదు శాతం, మలేసియాలో ఆరు శాతం, థాయిలాండ్‌లో ఏడు శాతం, జపాన్‌లో ఎనిమిది శాతం... ఇలా ప్రపంచ వ్యాప్తంగా అనేక దేశాల్లో వస్తు, సేవల పన్ను మన దేశంతో పోలిస్తే తక్కువే. దానికి కారణం దేశంలోని పన్ను చెల్లింపుదార్ల సంఖ్యే. ఆదాయం ఎక్కువున్నా కాకి లెక్కలతో పన్నులు ఎగ్గొట్టేవాళ్లు మన దగ్గర చాలా ఎక్కువ. పన్నుల విభాగాల్లో అవినీతీ ఎక్కువే. ఉన్న కొద్దిమందీ చెల్లించే పన్నులతో దేశం ముందుకెళ్లడం అసాధ్యం. కాబట్టి తొలి దశలో మన జీఎస్‌టీ ఎక్కువగానే కనిపిస్తుంది. కానీ పన్నుల విధానం కఠినతరం కావడంతో రాబోయే రోజుల్లో వాటి వసూలు పెరిగి, జీఎస్‌టీ తగ్గడం ఖాయం అంటున్నారు ఆర్థిక విశ్లేషకులు. ఇతర దేశాల్లో కూడా ఎక్కువ పన్నుతోనే మొదలై క్రమంగా తక్కువకి వచ్చి స్థిరపడింది. అంటే జీఎస్‌టీ రేటు... పన్నుల వసూళ్లతో పాటు ప్రజల నిజాయతీపైనా ఆధారపడి ఉంటుంది.







## మనమేం చేయాలి?

పనులు చేయట్లేదని ప్రభుత్వాన్ని నిలదీయడమే కాదు, సక్రమంగా పన్నులు చెల్లించడం కూడా ప్రతి పౌరుడి బాధ్యతే. ప్రభుత్వానికి కట్టే ప్రతి రూపాయీ గ్యాస్ సబ్సిడీ, మంచి నీళ్లు, రహదార్లు, ప్రభుత్వాసుపత్రులూ, స్కూళ్లు, సంక్షేమ పథకాలూ అంటూ ఏదో ఒక రూపంలో తిరిగి మన దగ్గరికే వస్తుందని గుర్తుంచుకుంటే, పన్ను పోటు భారంగా అనిపించదు. అమెరికా అభివృద్ధికి కారణం అక్కడి ప్రభుత్వాలు మాత్రమే కాదు, మనతో పోలిస్తే (1.5శాతం) అక్కడ ఎక్కువ శాతం(48శాతం) పౌరులు ఆదాయ పన్ను సరిగ్గా కట్టడం కూడా.

పది రూపాయలైనా, లక్ష రూపాయలైనా కొన్న ప్రతి వస్తువుకీ బిల్లు తీసుకోవడం మన కర్తవ్యం. బిల్లు తీసుకోవట్లేదంటే ఆ మేరకు పన్ను ఎగ్గొట్టే అవకాశం వ్యాపారికి ఇస్తున్నట్టే. అది దేశ ద్రోహం కిందే లెక్క.

## ఏమిటీ అపోహలు?

జీఎస్టీ వల్ల ప్రజలపైన పెనుభారం పడుతుందని రకరకాల వదంతులు సోషల్ మీడియాలో వ్యాపిస్తున్నాయి. కానీ అవన్నీ గాలి వార్తలేనని రెవెన్యూ కార్యదర్శి హస్ముక్ అదియా కొట్టిపారేస్తున్నారు.

★ మొత్తంగా గతంలో ఉన్న పన్నులతో పోలిస్తే జీఎస్టీ చాలా ఎక్కువన్న మాట ప్రచారంలో ఉంది. గతంలో ఎక్సైజ్ పన్నులూ, ప్రవేశ రుసుం లాంటి కొన్ని పన్నులు బిల్లుల్లో పైకి కనిపించేవి కావు. కాబట్టి వినియోగదారుడికి వస్తువుపైన ఉన్నది మాత్రమే పన్నులా అనిపించి అది తక్కువగా కనిపించేది. కానీ ఇప్పుడవన్నీ జీఎస్టీ కిందకే రావడంతో పన్ను ఎక్కువగా కనిపిస్తుంది. నిజానికి జీఎస్టీ అమలుతో రోజువారీ వినియోగంలో ఉన్న చాలా వస్తువులపైన పన్నులు తగ్గాయి.

★ క్రెడిట్ కార్డులతో ఏవైనా బిల్లులు చెల్లించినప్పుడు రెండుసార్లు జీఎస్టీ కట్టాల్సి వస్తుందనీ, అందువల్ల నగదు లావాదేవీలు మంచివనీ సోషల్ మీడియాలో ప్రచారం సాగుతోంది. అందులో ఏమాత్రం నిజం లేదు. కార్డు ద్వారా చేసిన చెల్లింపుల ద్వారా ప్రత్యేకంగా ఎలాంటి పన్నూ ఉండదు.

★ జీఎస్టీ వల్ల ప్రతి వ్యాపారి దగ్గరా నిత్యం ఇంటర్నెట్ సదుపాయం ఉండాల్సిందేనని, ఇన్‌వాయిస్‌లన్నీ కంప్యూటర్ ద్వారానే జారీ చేయాలన్నది మరో ప్రచారం. ఇన్‌వాయిస్‌లు కంప్యూటర్ ద్వారానే జారీ చేయాలన్న నిబంధనేమీ లేదు. నెలవారీ రిటర్నులు ఫైల్ చేసేప్పుడు మాత్రమే ఇంటర్నెట్ అవసరం. మిగతా సమయంలో లేకపోయినా ఇబ్బందేమీ లేదు.

## నిర్ణయం ఎవరిది?

కేంద్ర ప్రభుత్వమో లేక రాష్ట్ర ప్రభుత్వమో ఎప్పుడుపడితే అప్పుడు జీఎస్టీ చట్టంలో, నిబంధనల్లో మార్పుచేర్పులు చేయడం అసాధ్యం. జీఎస్టీ పైన సర్వాధికారాలూ జీఎస్టీ కౌన్సిల్‌వే. కేంద్ర ఆర్థిక మంత్రి ఆ కౌన్సిల్‌కి అధ్యక్షుడిగా, అన్ని రాష్ట్రాల ఆర్థిక మంత్రులు అందులో సభ్యులుగా కొనసాగుతారు. కౌన్సిల్‌లో కేంద్రానికి ఒక వంతు, రాష్ట్రాలకు రెండొంతుల ప్రాధాన్యం ఉంటుంది. ఏ నిర్ణయం మారాలన్నా, అమలు కావాలన్నా నాల్గింట మూడొంతుల మంది సభ్యుల ఓట్లు రావాల్సిందే. అంటే అటు కేంద్రానికి కానీ, ఇటు రాష్ట్రానికి కానీ జీఎస్టీ నిబంధనల్ని మార్చడానికి పూర్తి అధికారాలు ఉండవు. అందరూ ఒక మాట మీద నిలబడితేనే ఏ మార్పు చేర్పులైనా సాధ్యపడతాయి. అలా ఏళ్ల తరబడి అన్ని రాష్ట్రాల ప్రతినిధులతో చర్చలూ, వాళ్ల సలహాలూ సూచనల మేరకు రూపొందిన నిబంధనలూ, అన్ని రాష్ట్రాల ఏకాభిప్రాయానికి అనుగుణంగానే ప్రస్తుత జీఎస్టీ బిల్లు అమల్లోకి వచ్చింది. భవిష్యత్తులోనూ జీఎస్టీపైన సర్వాధికారాలూ ఆ కౌన్సిల్‌వే.

## మొదట ఎక్కడ?

★ ప్రపంచవ్యాప్తంగా 160కిపైగా దేశాల్లో జీఎస్టీ అమలులో ఉంది. ఆ జాబితాలో భారత్ కాస్త ఆలస్యంగానే చేరింది. అందరి కంటే ముందు ఫ్రాన్స్ 1954లోనే తొలిసారిగా జీఎస్టీని అమల్లోకి తీసుకొచ్చింది. అభివృద్ధి చెందిన దేశాలన్నీ ఎప్పుడో జీఎస్టీ బాట పట్టినా, అమెరికా ఇప్పటికీ ఆ విధానాన్ని అనుసరించట్లేదు.

★ జీఎస్టీపైన అవసరమైన సలహాలూ, సమాచారం, సేవల్ని అందించేందుకు ప్రభుత్వం దేశవ్యాప్తంగా జీఎస్టీ సహాయ కేంద్రాలని ఏర్పాటు చేస్తోంది. దీనికోసం లాభాపేక్ష లేని విస్తృతమైన ఐటీ వ్యవస్థని త్వరలో తీసుకురానుంది. ఫలితంగా వేలాది కొత్త ఉద్యోగాలు ఏర్పడే అవకాశం ఉంది.

★ భారత్‌లో ఏటా ఇరవై లక్షలకు పైగా వ్యాపార లావాదేవీలు నిర్వహించేవాళ్లంతా జీఎస్టీ కింద నమోదు చేసుకోవాలి. అదే సింగపూర్‌లో అయితే వార్షికాదాయం రూ. 4.8కోట్ల లోపు ఉన్నవాళ్లు జీఎస్టీ పరిధిలోకి వచ్చి పన్ను చెల్లించాల్సిన అవసరం లేదు.

★ జీఎస్టీ బిల్లుని రూపొందించే ప్రక్రియ మొదలై, అది అమలవ్వడానికి భారత్‌లో పదిహేడేళ్లు పట్టింది. తక్కిన దేశాల్లో సగటున రెండు మూడేళ్లలో ఆ ప్రక్రియ పూర్తయింది.

★ ఇప్పటిదాకా మన పార్లమెంటు నాలుగుసార్లు మాత్రమే అర్ధరాత్రి సమావేశమైంది. ఒకటి.. 1947లో స్వాతంత్ర్యం సిద్ధించిన రోజున. రెండు... 1992లో క్విట్ ఇండియా ఉద్యమం యాభయ్యో వార్షికోత్సవం సందర్భంగా. మూడు... 1997లో స్వాతంత్ర్యం వచ్చి యాభై ఏళ్లయిన సందర్భంగా. నాలుగు... 2017 జులై 1న జీఎస్టీ బిల్లు ప్రవేశ పెట్టిన రోజున.

★ ★ ★

మొన్నీమధ్య అమలు చేసిన పెద్ద నోట్ల రద్దయినా, ఇప్పుడు ప్రవేశ పెట్టిన వస్తు, సేవల పన్నైనా, భవిష్యత్తులో రాబోయే మరో పథకమేదైనా... అన్నింటి లక్ష్యం భారత్‌ని అవినీతి రహితంగా మార్చి, అభివృద్ధి మార్గంలో నడిపించడమే. కానీ అది ఒక్క రోజులోనో, ఒక్క నెలలోనో సాధ్యమయ్యేది కాదు. ఐపీఎల్ మ్యాచ్‌లూ, రాజమౌళి సినిమాల కోసమే ఏడాదికిపైగా ఓపిగ్గా ఎదురు చూస్తున్న రోజులివి. అలాంటిది ప్రభుత్వ పథకాల ఫలితాల కోసం, మంచి భవిష్యత్తు కోసం కొన్నాళ్లు ఎదురు చూడలేమా! చూద్దాం... మన దేశ 'గ్రేట్, సక్సెస్‌ఫుల్ ట్రాన్స్‌ఫర్మేషన్'కి... ఈ 'గుడ్, సింపుల్ టాక్స్' పునాది వేస్తుందేమో..! ★



విద్యార్హతలున్నా నైపుణ్యం లేక చాలామంది యువతీయువకులు ఉపాధి పొందలేకపోతున్నారు. నైపుణ్యం ఉన్న అభ్యర్థులు దొరక్క చాలా కంపెనీలు ఉద్యోగుల ఎంపికలో ఆచితూచి అడుగులు వేస్తున్నాయి. ఈ పరిస్థితిలో మార్పు తీసుకురావడానికి ఓ అద్భుత కార్యక్రమాన్ని చేపడుతోంది 'బైరెడ్'.





# ఉద్యోగానికి ఇక సిద్ధం!

నైపుణ్యంలేక ఎంతో మంది ఉద్యోగాలకు దూరమవుతున్నారు. వ్యాపారాల్లో అడుగు పెట్టాలని ఉన్నా... మార్గనిర్దేశంలేక ముందడుగు వేయలేకపోతున్నారు. ఈ విషయంలో గ్రామీణ ప్రాంతాల వారిది మరీ వెనుకబాటు. దీనికి పరిష్కారంగా మొదలైందే 'బ్యాంకర్స్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ రూరల్ అండ్ ఆంత్రొప్రెన్యూర్‌షిప్ డెవలప్‌మెంట్(బైరెడ్)'. 2007లో మొదలైన బైరెడ్ వెనుక ఆంధ్రా బ్యాంక్, కెనరా బ్యాంక్, కార్పొరేషన్ బ్యాంక్, ఇండియన్ ఓవర్సీస్ బ్యాంక్, ఇండియన్ బ్యాంక్, అప్పటి స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్‌లు ఉన్నాయి. ఈ బ్యాంకులు 'కార్పొరేట్ సోషల్ రెస్పాన్సిబిలిటీ'లో భాగంగా 'బైరెడ్'ను మొదలుపెట్టాయి. దీనికోసం ఇవి నాబార్డ్(నేషనల్ బ్యాంక్ ఫర్ అగ్రికల్చర్ అండ్ రూరల్ డెవలప్‌మెంట్)తో జట్టుకట్టాయి. బైరెడ్ ప్రతిపాదన వచ్చినపుడు అప్పటి రాష్ట్రప్రభుత్వం హైదరాబాద్‌లోని రాజేంద్రనగర్‌లోని అపార్డ్ (ప్రస్తుత టీసీపార్డ్)కు చెందిన సుమారు 12 ఎకరాల స్థలాన్ని కేటాయించింది.

### *45 రోజుల శిక్షణ*

బైరెడ్ ప్రధానంగా ఉద్యోగం, స్వయం ఉపాధి విభాగాల్లో తెలుగు రాష్ట్రాలకు చెందిన గ్రామీణ యువతకు శిక్షణ ఇస్తుంది. 45 రోజులపాటు సాగే ఈ శిక్షణ ఏడాదిలో యువకులకు అయిదు విడతల్లో, యువతులకు రెండు విడతల్లో ఉంటుంది. ఎం.ఎస్. ఆఫీస్, మొబైల్‌ఫోన్ రిపేరింగ్, కంప్యూటర్ హార్డ్‌వేర్, ఎలక్ట్రీషియన్ విభాగాల్లో అబ్బాయిలకూ; బ్యూటీషియన్ కోర్సు, అడ్వాన్స్‌డ్ టైలరింగ్, జర్దోసి, మగ్గం, ఎం.ఎస్.ఆఫీస్... తదితర విభాగాల్లో అమ్మాయిలకూ నిపుణులైన అధ్యాపకుల పర్యవేక్షణలో శిక్షణ ఇస్తారు. శిక్షణ కాలంలో అభ్యర్థులకు అవసరమయ్యే సామగ్రిని ఉచితంగానే అందిస్తారు. కంప్యూటర్స్‌కు సంబంధించిన కోర్సుల్లో శిక్షణ తీసుకునేవారికి శిక్షణ సమయంలో ఉపయోగించేందుకు వీలుగా ఓ ల్యాప్‌టాప్ ఇస్తారు. 45రోజుల శిక్షణ ముగిశాక వివిధ సంస్థల్లో ఉద్యోగాలు కల్పించడానికి బైరెడ్ సంస్థ ప్రతినిధులు తమవంతుగా అభ్యర్థులకు సహకారం అందిస్తారు కూడా. ఇక్కడ శిక్షణ తీసుకున్నవారెవరైనా సొంతంగా వ్యాపారం ప్రారంభించడానికి ఆసక్తి చూపిస్తే బ్యాంకుల నుంచి రుణాలు పొందడంలోనూ సాయపడతారు. శిక్షణ తర్వాత కూడా దాదాపు రెండేళ్లపాటు మార్గనిర్దేశం చేస్తూ ఏదో ఒక రంగంలో కుదురుకునేంతవరకూ వారిని పర్యవేక్షిస్తారు.

### *తక్కువకే ప్రాధాన్యం*

బైరెడ్‌లో శిక్షణ పొందాలనుకునేవారు bired.org వెబ్‌సైట్లో దరఖాస్తు చేసుకోవాలి. వచ్చిన దరఖాస్తుల్లో అతి తక్కువ నైపుణ్యం ఉన్నవారికి ప్రాధాన్యమిస్తారు. ఎందుకంటే ఎక్కువ నైపుణ్యం ఉన్నవాళ్లు ఏదో ఒక ఉద్యోగం సాధించే అవకాశం ఉంటుంది. ఎంపికైన అభ్యర్థులకు శిక్షణ సమయంలో భోజన, వసతి సదుపాయాలు ఉంటాయి. ఈ సేవలూ, సదుపాయాలన్నీ పూర్తిగా ఉచితం. శిక్షణ కాలమంతా సంస్థ ఆవరణలోని వసతి గృహాల్లోనే ఉండాలనేది నిబంధన. ఈ సమయంలో వ్యక్తిత్వ వికాస తరగతులూ నిర్వహిస్తారు. రోజూ యోగా శిక్షణ ఉంటుంది. అభ్యర్థుల్ని ఉత్సాహంగా ఉంచడానికి క్రీడా పోటీల్నీ నిర్వహిస్తారు. 'జీవితంలో స్థిరపడాలనే బలమైన లక్ష్యంతో యువతీయువకులు ఇక్కడికి వస్తారు. వారు తమ లక్ష్యాన్ని చేరుకోవడంలో మా వంతుగా సాయం అందించడమే మా కర్తవ్యం' అని చెబుతారు సంస్థ సంచాలకులు యేసేపు. శిక్షణ సమయంలో అభ్యర్థుల ఆరోగ్య సంరక్షణనీ బైరెడ్ చూసుకుంటుంది. సత్యసాయిబాబా సేవా సమితి ఆధ్వర్యంలో ఉచిత వైద్య పరీక్షలు నిర్వహిస్తారు. 'గతేడాది ఓ యువతికి వైద్య పరీక్షలు చేసినపుడు తీవ్ర ఆరోగ్య సమస్యని గుర్తించారు. వైద్యం కోసం అవసరమైన ఎనిమిది లక్షల రూపాయల్ని సత్యసాయిబాబా సేవా సమితి విరాళాల రూపంలో సేకరించి అందించింది' అని అంటారు బైరెడ్ ఉప సంచాలకులు కె.ఎన్.ప్రసాద్. శిక్షణ అనంతరం అభ్యర్థులు ఇళ్లకు వెళ్లే సమయంలో దూరాన్నిబట్టి ఛార్జీలనూ సంస్థ సభ్యులే అందిస్తారు.

హైదరాబాద్‌లోనే కాకుండా తెలుగు రాష్ట్రాల్లోని వివిధ సంస్థల భాగస్వామ్యంతోనూ శిక్షణ కార్యక్రమాలను నిర్వహిస్తోంది బైరెడ్. ఇటీవల తిరుపతిలో ఓ స్వచ్ఛంద సంస్థ సహకారంతో మహిళలకు ఆటో నడపడంలో శిక్షణ ఇచ్చారు. శిక్షణ పూర్తిచేసుకున్న వారికి బ్యాంకుల ద్వారా రుణాలు అందజేసి ఆటోలను ఇప్పించారు. ప్రస్తుతం రంగారెడ్డి జిల్లా సరూర్‌నగర్, విశాఖపట్నం జిల్లా గొట్టిపల్లి, పశ్చిమగోదావరి జిల్లా పాలకొల్లులలో ఈ శిక్షణ కార్యక్రమాలు సాగుతున్నాయి. 'ఇప్పటివరకూ శిక్షణకు ఏటా 1100 మందిని ఎంపిక చేస్తున్నాం. డిమాండ్ పెరుగుతుండటంతో ఇకపైన ఆ సంఖ్యను మరో 500 పెంచనున్నా'మంటారు కె.ఎన్.ప్రసాద్. సంస్థ ఆధ్వర్యంలో శిక్షణ పొందిన వారిలో 70 శాతం ఉద్యోగులుగా, కొందరు స్వయం ఉపాధి పొందుతూ, మిగిలినవారు వ్యాపారులుగా స్థిరపడ్డారు.

మీకూ చేరాలని ఉందా, ఎవరినైనా చేర్చాలని ఉందా... అయితే, సంస్థ వెబ్‌సైట్‌కు వెళ్లండి మరి!

*– వనం సుదర్శన్,* హైదరాబాద్ సిటీ డెస్క్

*– సూర్యకిరణ్,* న్యూస్‌టుడే రాజేంద్రనగర్



కథ

# వలపు వాకిట

– డా॥ తాళ్ళూరి లక్ష్మి

**"మీరు... మీరు... హేమంతేనా?" సన్నగా వీణమీటినట్లున్న పలకరింపు వినబడి చివాలున బుక్‌షెల్ఫ్ నుంచి తలతిప్పి పక్కకి చూశాడు హేమంత్. ఎదురుగా చిరుమందహాసంతో ప్రౌఢ వయసులో ఉన్న యువతి. వెనువెంటనే గుర్తుపట్టలేకపోయాడు. మరి చూసి దాదాపు పాతికేళ్ళపైనే అయిందాయె. గుర్తుకొచ్చేసరికి గుండె ఒక్కసారిగా లయ తప్పినట్టయింది.**

**"మీరు... మధుమిత కదూ?" ఆనందం, ఆశ్చర్యం ముప్పిరిగొన్న కంఠంతో పలకరించాడు హేమంత్.**

ముఖాన అదే చిరుదరహాసం. వయసుతో పాటు కొద్దిగా ఒళ్ళు చేసినట్టుంది కానీ మనిషిలో ఆ ఆకర్షణ ఏమాత్రం తగ్గలేదు. కోలముఖాన కనబడీ కనబడనట్టు దోసకాయ గింజంత బొట్టు, కొటేరు లాంటి నాసిక మీద ఉన్నావా లేదా అన్నట్లు మెరుస్తున్న ముక్కుపుడక, కలువపూల లాంటి వెడల్పయిన కళ్ళూ, చామనఛాయరంగు, ఒంటిని మరింత ఆకర్షవంతం చేస్తూ లేత నీలం రంగు సిల్కుచీరె, అక్కడక్కడా నెరసిన బాబ్డ్‌హెయిర్ మనిషికి ఒక విధమైన హుందాతనం తీసుకొచ్చింది.

"అమ్మయ్య, గుర్తుపట్టావన్నమాట" కళ్ళప్పగించి చూస్తున్న హేమంత్‌ని ఈ లోకంలోకి తీసుకువచ్చింది ఆమె గొంతు. ఆ గొంతులో ఎంతో రిలీఫ్ తనని గుర్తుపట్టాడని. తన ఊహ సరయ్యేసరికి బహువచనంలోంచి ఏకవచనంలోకి మార్చేసింది సంభోదనను.

"అదేమిటి, వసంతాగమనాన్ని ఎవరైనా గుర్తించకుండా ఉండగలరా?" ఎంతో మార్దవంగా అన్నాడు హేమంత్.

"ఓహో, అందుకనే కామోసు, దొంగచాటుగా పారిపోయి ఇన్నేళ్ళు మొహం చాటేసింది" నిష్ఠూరంగా అంది.

"ఇక్కడేమిటి, ఇలా హఠాత్తుగా ప్రత్యక్షమయ్యావు?" మాటమారుస్తూ అన్నాడు.

"ఆ మాట అడగాల్సింది నేను" ఒకప్పటి మాటకారితనం ఏమాత్రం తగ్గలేదని నిరూపిస్తూ ప్రశ్నకి బదులుగా మరోప్రశ్న వేసింది.

"అనుకోకుండా నాకు రాక్‌ఫెల్లర్ ఎక్స్ఛేంజ్ ప్రోగ్రామ్‌లో విజిటింగ్ ప్రొఫెసర్‌గా మూణ్ణెళ్ళు ఇక్కడికి రావడానికి అవకాశం దొరికింది. కిందటి నెలలో వచ్చాను. వచ్చే నెల్లో ఇండియాకి తిరిగి వెళ్ళిపోతాను. ఈ మాల్‌లోని బుక్‌స్టోర్‌లో మంచి పుస్తకాలు దొరుకుతాయంటే చూసి కొందామని వచ్చాను. మరి, నీ మాటేమిటి?"

"నేనా... బి.ఇ. పాసయ్యాక ఇక్కడికొచ్చి ఎమ్మెస్ చేశాను. జాబ్ కూడా ఇక్కడే దొరికింది. తరువాత పెళ్ళి చేసుకుని, ఆయన డి.ఎమ్. పూర్తయ్యాక పూర్తిగా ఇక్కడే స్థిరపడిపోయాం. నాలుగైదుసార్లు ఇండియాకి రావడం తప్పించి, అక్కడి బంధుత్వాలూ బంధాలూ అన్నీ దాదాపు తెగిపోయాయి. షాపింగ్‌కని ఈ మాల్‌కి వచ్చాను."

"పిల్లలా?"

"ఔను. ఒక అమ్మాయి. కాలేజీకి వెళుతోంది. మరీ నీ మాటేమిటి, పెళ్ళయిందా?"

"ఆఁ... అయింది."

"పిల్లలా?"

"ఊహూ... లేరు" ముక్తసరిగా చెప్పాడు.

"ఈ మాటల కేంగానీ చాలా ఏళ్ళ తరవాత కలిశాం. ఓ కప్పు కాఫీయేనా ఇప్పిస్తావా?" అదే చిలిపితనం, దబాయింపు.

ఇద్దరూ కేఫ్‌టేరియాకెళ్ళి కూర్చున్నారు- చెరో కప్పు కాఫీ తాగుతూ, పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ.



మాటల మధ్యలో మధుమిత ఉన్నట్టుండి అడిగింది "అలా చెప్పా పెట్టకుండా ఉన్నట్టుండి ఎందుకు పారిపోయావు హేమంత్?" అని.

ఏ క్షణాన్నైనా మధుమిత నుంచి ఆ ప్రశ్న వినాల్సి వస్తుందని తెలిసినా కూడా తను అలా అంత తొందరగా, ఆకస్మికంగా అడిగేసరికి ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు హేమంత్. మనసు అలా అలా గతంలోకి వెళ్ళిపోయింది.

★ ★ ★

హేమంత్ యూనివర్శిటీ కాలేజీలో ఇంజినీరింగ్ చదువుతున్న రోజులవి. ఆ ఏడే ఫైనలియర్‌లోకి అడుగుపెట్టాడు. ఆరోజే కాలేజీ రీఓపెనింగ్. తనెప్పుడూ బస్సెక్కే బస్టాప్- విద్యార్థినీ విద్యార్థులతో ఎంతో సందడిగా ఉంది. అన్నీ తెలిసిన ముఖాలే అవడంతో ఒకరితో ఒకరు సరదాగా మాట్లాడుకుంటున్నారు. హేమంత్ కూడా తన మిత్రులతో బాతాఖానీ చేస్తూ బస్సు కోసం ఎదురుచూస్తున్నాడు. అంతలో ఒక మెరుపు మెరిసినట్టయింది. మెరుపుతీగె లాంటి ఒక అందమైన అమ్మాయి మరో అమ్మాయితో కలసి బస్టాప్ దగ్గరకు వచ్చి నిలుచుంది. గులాబీరంగు పరికిణీ, అదే రంగు ఓణీ వేసుకుని అచ్చతెలుగు అమ్మాయిలా సింగారించుకుంది. సల్వారు కమీజులూ, జీన్స్‌ప్యాంట్లూ వేసుకుని ఉన్న మిగతా అమ్మాయిల గుంపులో క్రోటన్ మొక్కల మధ్యన విరబూసిన ముద్దమందారంలా ఎంతో ఆకర్షణీయంగా ఉంది. పదహారు, పదిహేడేళ్ళ ప్రాయం ఉండొచ్చు. కోలముఖం, చామనఛాయ రంగు, పెద్దపెద్ద కళ్ళు... కొంచెం బొద్దుగా, కొంచెం ముద్దుగా ఉండి కళ్ళు తిప్పుకోనీయటం లేదు. సభ్యతకాదని తెలిసినా హేమంత్ ఆ అమ్మాయి మీది నుంచి దృష్టి మరల్చుకోలేకపోయాడు. ఇంతలో బస్సు రావటంతో విద్యార్థులందరూ బిలబిలమంటూ బస్సెక్కేశారు.

ఇంజినీరింగ్ కాలేజీ బస్టాప్‌లోనే ఆ అమ్మాయి కూడా దిగడంతో హేమంత్ హృదయం ఎగిరి గంతులేసింది. ఆ అమ్మాయెవరో తెలుసుకోవడానికి తన వెనకే నడుచుకుంటూ వెళ్ళాడు. ఆ అమ్మాయి కాలేజీ బిల్డింగ్‌లో ప్రవేశించి తిన్నగా ఆఫీసు వైపు వెళ్ళింది. ఆఫీసులో ఎవరూ కనిపించకపోవడంతో అటూఇటూ చూస్తూ అక్కడే తచ్చాడుతున్న హేమంత్‌ని చూసి "సార్, ఫస్టియర్ క్లాసెస్ ఎక్కడవుతా"యని అడిగింది.

హేమంత్ మనసు ఒక్కసారి ఆనందంతో పరవళ్ళు తొక్కింది. ఆ అమ్మాయిని వాళ్ళ

క్లాస్‌దాకా దిగబెట్టి "అయామ్ హేమంత్. ఫైనలియర్ స్టూడెంట్‌ని. మే ఐ నో యువర్ గుడ్ నేమ్ ప్లీజ్" అన్నాడు స్టైల్‌గా. ఆ అమ్మాయి పెదవులు విడీవిడని విధంగా చిన్నగా నవ్వి తన పేరు చెప్పింది. హేమంత్‌కి ఆ విధంగా తెలిసింది ఆ మెరుపుతీగ పేరు మధుమిత అని.

అలా మొదలైంది హేమంత్ మధుమితా రాధన. ఆ రోజల్లా ఏ పనిచేస్తున్నా మధు మిత రూపమే కళ్ళముందు దోబూచులాడ సాగింది. లెక్చరర్స్ చెబుతున్న పాఠాలు బుర్ర కెక్కలేదు. సాయంత్రం కాలేజీ వదిలాక కూడా ఆ అమ్మాయి కోసం వేచిచూస్తూ ఎన్నో బస్సులు ఎక్కకుండా వదిలేశాడు. చివరకు మధుమిత వచ్చాక ఆమె ఎక్కిన బస్సులోనే ఎక్కి ఆమె దిగినచోటే దిగాడు. అయితే, స్వభావతా బిడియస్థుడు కావడంతో ఆమెతో పరిచయం ఎలా పెంచుకోవాలో తెలియక తన ఇంటిదారి పట్టాడు ఆమెను వదిలేసి.

ఇంటికెళ్ళాక కూడా హేమంత్ ఏ పనిమీదా మనసు లగ్నం చేయలేకపోయాడు. రాత్రంతా ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా... మధుమితని ఎప్పుడు చూడ్డానికి వీలవు తుందా అని ఆలోచించడంతోనే సరిపో యింది. మర్నాటి పొద్దుట మామూలుకంటే అరగంటముందే బస్టాప్ చేరుకున్నాడు- మధుమితని ఎక్కడ మిస్సవుతానో అను కుంటూ. అయితే, ఎన్ని బస్సులు వచ్చి వెళ్ళి పోయినా మధుమిత జాడలేదు. చివరకు మిత్రులందరూ కలిసి బలవంతం చేస్తే ఓ బస్సెక్కి కాలేజీకి వెళ్ళాడు. కాలేజీలో ఆ రోజంతా దిగాలుగానే గడిపాడు. ఒకటి రెండుసార్లు ఫస్టియర్ క్లాస్ చుట్టూ ప్రదక్షిణలు చేశాడు మధుమిత ఎక్కడైనా కనిపిస్తుందేమోనని. అయితే, ఆ రోజంతా ఆ అమ్మాయి దర్శనమే కాలేదు.

మూడోరోజు సెలవు రోజైనా స్పెషల్ క్లాస్ ఉండటంతో పొద్దుటే బయల్దేరి బస్టాప్ చేరుకున్నాడు- ఆరోజు మధుమిత ఎలానూ కలవదన్న నిస్పృహతో. అయితే అనుకో కుండా బస్టాప్‌లో మధుమిత కనిపించింది మరో ఇద్దరు నడివయసు ఆడవాళ్ళతో కలసి మాట్లాడుతూ. తలంటు పోసుకున్న కురు లతో, నీలిరంగు పట్టు పరికిణీ పావడాలతో, మెళ్ళో నెక్లెస్‌తో... స్పెషల్‌గా తయారై ఎంతో ముచ్చటగా అనిపించింది. ఏదో శుభ కార్యానికి వెళుతున్నట్టుంది, బాగా ముస్తా బయింది. హేమంత్ వాళ్ళకి కొద్దిదూరంలో నుంచున్నాడు బస్ కోసం ఎదురుచూస్తూ, ముఖాన్ని మరోపక్కకి తిప్పి.

అంతలో "హేమంత్‌గారూ, కాలేజీకి వెళుతున్నారా? ఇవాళ సెలవు కదా?" అని వినిపిస్తే పక్కకి తిరిగి చూశాడు... మధుమిత! తననే అడుగుతోంది. కలా నిజమా అని చెయ్యి గిల్లుకున్నాడు.



"మిమ్మల్నే హేమంత్‌గారూ, ఈరోజు కాలేజీ ఉందా?" అని మధుమిత మళ్ళా అడగడంతో ఈ లోకంలోకి వచ్చి-

"ఆఁ... లేదు.. లేదు.. కాలేజీకి సెలవే కానీ, మాకు స్పెషల్ క్లాస్ ఉంది" అని తడబడుతూ చెప్పాడు.

మధుమిత గలగలా నవ్వుతూ "ఎందుకు అంత కంగారుపడుతున్నారు?" అంది.

అప్పటికి తేరుకున్న హేమంత్ "మీరు నిన్న కాలేజీకి రాలేదేమిటి?" అని అడిగాడు.

"ఓహో! నేను రాలేదని గమనించారన్న మాట. ఏమీలేదు, ఊర్నించి మా అత్తయ్య వచ్చింది. అందుకే నిన్న కాలేజీకి రాలేక పోయాను. అదిగో అక్కడ గళ్ళ పట్టుచీరెలో ఉందే... ఆవిడే మా అత్తయ్య. పక్కనున్నది మా అమ్మ. మన కాలేజీకి దగ్గర్లోని ఓ కాలనీలో మా బంధువుల ఇంట్లో ఏదో ఫంక్షన్ ఉంటే అక్కడికి వెళుతున్నాం. రండి మావాళ్ళకి పరిచయం చేస్తాను" అని వాళ్ళ దగ్గరకు తీసుకెళ్ళింది. "అమ్మా, అత్తయ్యా... ఈయన హేమంతని నా సీనియర్. ఫైనలియర్ చదువుతున్నారు మా కాలేజీ లోనే" అని పరిచయం చేసింది.

అలాగ పెరిగిన పరిచయంతో హేమంత్, మధుమితల మధ్య సాన్నిహిత్యం క్రమంగా ఎక్కువైంది. 'మీరు' నుంచి 'నువ్వు' అని సంబోధించుకునేదాకా ఎదిగింది. బస్టాప్‌లో పలకరింపులూ, కాలేజీలో ముచ్చట్లతోపాటు ఇద్దరి అభిరుచులు కూడా కలవడంతో బాగా చేరువయ్యారు. హేమంత్ స్వతహా భావుకుడు కావడంతో అతనికి మధుమిత చేసే ప్రతి పనీ ఎంతో ఆకర్షణీయంగా కనిపించేది. ఒక్కోరోజు ఒక్కో వస్త్రాలంకరణతో కొత్తకొత్తగా కనిపించేది. ఒకరోజు ముద్దమందారాన్ని తలపిస్తే, మరోరోజు అరవిచ్చిన గులాబీ పువ్వుని గుర్తుకుతెచ్చేది. ఆమెని చూడగానే ఆమని రాకకి పులకరించిపోతున్న కోయిల లాగా, చిరుజల్లులకు పరవశిస్తూ పురివిప్పి నాట్యం చేస్తున్న మయూరిలాగా హృదయం ఆనందంలో ఓలలాడేది. ఆమె ఒకరోజు ముగ్ధలాగ కనిపిస్తే, మరోరోజు నెరజాణ లాగా అనిపించేది. వయసు మహత్యమో, సామీప్యతో తెలీదుగానీ ఆమె అంటే ఒక విధమైన ఇష్టం, అనురాగం కలగసాగాయి. ఆమెని ఏ ఒక్కరోజు చూడలేకపోయినా లోక మంతా శూన్యంగా అనిపించేది. మధుమిత చలాకీతనం, మాటకారితనం, ఎప్పుడూ గల గలా మాట్లాడే తత్వం హేమంత్‌ని ఎంత గానో ఆకర్షించాయి. అలాగే, భిన్నధృవాలు ఆకర్షించుకుంటాయి అన్నట్టు హేమంత్‌లోని భావుకత్వం, బిడియం, మితభాషిత్వం మధుమితని ఎంతగానో అకట్టుకున్నాయి.

కాలేజీ మొదలైన రెండో నెలకో, మూడో నెలకో హేమంత్ నాన్నగారికి అనుకోకుండా ఢిల్లీకి ట్రాన్స్‌ఫరై వెనువెంటనే వెళ్ళిపోవలసి వచ్చింది కుటుంబంతో సహా. దాంతో హేమంత్‌కి నివాసం ఒక ప్రశ్నార్థకంగా తయారైంది. హాస్టల్‌కి మారవచ్చుకానీ దాని వలన మధుమిత సాహచర్యం కోల్పోతాడు. అందుకని మధుమిత ఇంటి దగ్గరే ఏదైనా గది అద్దెకు తీసుకుని ఉందామనుకున్నాడు. అదేమాట మధుమితతో అంటే దానికామె "మా ఇంట్లోనే ఔట్‌హౌస్ ఖాళీగా ఉంది. నీకు నచ్చితే మా నాన్నగారికి చెప్పి ఇప్పిస్తాను" అంది. రొట్టె విరిగి నెయ్యిలోపడ్డ చందమైంది హేమంత్ అదృష్టం. వెంటనే తన అంగీకారం తెలిపి ఆ ఔట్‌హౌస్‌కి మారిపోయాడు.

మధుమిత వాళ్ళ నాన్నగారు విపరీతమైన ప్రాక్టీసు ఉన్న లీడింగ్ లాయరు. భారీ పర్సనాలిటీతో, గంభీరమైన స్వరంతో నటుడు ఎస్వీ రంగారావుని తలపుకు తెచ్చేవారు. మధుమిత వారి ఏకైక సంతానం. నాన్నగారి గారాలపట్టి. వారిల్లు ఎప్పుడూ బంధుమిత్రు లతో కళకళలాడుతుండేది. మధుమిత వాళ్ళమ్మగారైతే ఆతిథ్యంలో అన్నపూర్ణమ్మనే మించిపోయేవారు. అటువంటి వాతావర ణంలో పెరిగిన మధుమిత మంచితనానికే ప్రతీకగా ఉండేది. హేమంత్ పేరుకే ఔట్ హౌస్‌లో నివసించే స్టూడెంట్ కానీ, అతని

## కలం కదిలించండి

సృజనాత్మకత కలిగిన రచయితలకూ రచయిత్రులకూ ఇదే ఆహ్వానం. మానవ జీవితంలోని విభిన్న పార్శ్వాలను స్పృశిస్తూ మధురమైన అనుభూతులను పాఠకులకు పంచే కథ లకు 'ఈనాడు' స్వాగతం పలుకుతోంది. భావం ఏదైనా... కథనంలో వైవిధ్యం, పాఠకులను ఏకబిగిన చదివించగలిగే బిగువూ ఉండాలి. ఆశావహ దృక్పథంతో సాగే కథలకు ప్రాధాన్యం. కథ సాధా రణ చేతి రాతలో ఏడు అరఠావులకు మించకూడదు.

కథలు పంపాల్సిన చిరునామా:

**ఆదివారం అనుబంధం**
**రామోజీ ఫిలింసిటీ, హయత్‌నగర్ (మం), రంగారెడ్డి జిల్లా, తెలంగాణ-501 512.**

భోజనాదులన్నీ అధికభాగం మధుమిత వాళ్ళింట్లోనే జరిగేవి. మధుమిత కూడా రోజులో ఎక్కువభాగం హేమంత్‌తోనే గడుపుతుండేది. కంబైన్డ్ స్టడీస్ చేస్తూనో, రాని పాఠాలు చెప్పించుకుంటూనో, కబుర్లు చెబుతూనో లేదా రేడియోలో సంగీతం వింటూనో. కాదేదీ కవిత కనర్హమన్నట్టు వాళ్ళు మాట్లాడుకునే స్వీట్ నథింగ్స్‌కి- సీతాకోకచిలుకల రంగుల నుంచి విమెన్స్ లిబ్ మూవ్‌మెంట్‌దాకా, జోగ్‌ఫాల్స్ నుంచి నయాగరా ఫాల్స్ వరకూ, పెద్ద బాలశిక్ష నుంచి అభిజ్ఞాన శాకుంతలందాకా పనికిరాని విషయమనేదే ఉండేదికాదు. హేమంత్, మధుమితలిద్దరూ వాళ్ళ హద్దులో ఉంటున్నా కూడా ఒకరిమీద ఒకరు పెంచుకుంటున్న ఇష్టం, అనురాగం వారి కళ్ళల్లో మాటల్లో నడవడికలో ప్రస్ఫుటంగా కనబడేది.

మధుమిత సాంగత్యంలో ఫైనలియర్ ఇట్టే గడిచిపోయినట్టయింది హేమంత్‌కి. చూస్తూ చూస్తూనే ఫైనల్ పరీక్షలు కూడా అయిపోయాయి. అయితే వెంటనే ఇల్లు ఖాళీచేసి ఢిల్లీలో ఉన్న తల్లిదండ్రుల దగ్గరకు వెళ్ళబుద్ధి కాలేదు హేమంత్‌కి- ఎక్కడ మధుమిత సాహచర్యం కోల్పోతానో ఏమో అని. అందుకనే ఏవో సాకులు చెబుతూ చాలా రోజులదాకా ప్రయాణాన్ని వాయిదా వేశాడు.

ఒకరోజు రాత్రి భోజనం కానిచ్చి ఏదో పుస్తకం చదువుకుంటూ కూర్చున్న సమయాన ఎవరో తలుపు తట్టినట్లయితే వెళ్ళి తలుపు తీశాడు. ఎదురుగా మధుమిత నాన్నగారు. అందరూ లైట్లార్పేసి పడుకుని ఉన్నట్టున్నారు. బయటంతా చీకటిగా ఉంది. ''లోపలికి రావచ్చా హేమంత్?'' అంటూ ఆయన లోపలికి వచ్చారు. ఆ సమయంలో ఆయనెందుకు వచ్చారో అంతుపట్టలేదు హేమంత్‌కి.

''కూర్చోండి అంకుల్'' అంటూ కుర్చీ చూపి పక్కనే నిలబడ్డాడు హేమంత్.

ఆయన ''నువ్వు కూడా కూర్చో హేమంత్'' అనడంతో పక్కనే ఉన్న మంచంమీద కూర్చున్నాడు.

ఆయన ఉపోద్ఘాతం అదీ ఏమీ లేకుండా నేరుగా మాట్లాడటం మొదలెట్టారు.

''చూడు హేమంత్, నాది చల్లకొచ్చి ముంత దాచే తత్వం కాదు. చెప్పదలచుకున్నదేదైనా ముఖాముఖి చెప్పేయడం అలవాటు. సంవత్సరంగా నిన్నూ, మధునీ గమనిస్తున్నాను. మీ ఇద్దరి నడవడికలో ఎటువంటి పొరబాట్లూ లేనప్పటికీ, మీరిద్దరూ ఒకరంటే ఒకరు ఇష్టం పెంచుకుంటున్నట్టు అనిపించింది. ఈ ఇష్టం శాశ్వతమైన ప్రేమా లేక ప్రాయంలో మొలకెత్తే ఆకర్షణా అనే విషయం పక్కనబెడితే, నీకొక విషయం తెలియజేయడం మధుమిత తండ్రిగా నా బాధ్యత అనుకుంటున్నాను. మధుమిత పుట్టగానే మా కుటుంబంలో అందరూ అనుకున్నది సాకేత్‌కి భార్య పుట్టిందని. సాకేతంటే నా మేనల్లుడు. నా ఒక్కగానొక్క చెల్లెలి కొడుకు. ప్రస్తుతం స్టేట్స్‌లో మెడిసిన్‌లో పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేస్తున్నాడు. మధు చదువైపోగానే ఇద్దరికీ వివాహం చేద్దామనుకుంటున్నాం. మధు కూడా ఎప్పుడూ సాకేతంటే అయిష్టతగానీ, అతడితో వివాహానికి విముఖతగానీ చూపలేదు. అట్లాగే సాకేత్ కూడా. అయితే, ఇప్పుడు నీపట్ల పెంచుకుంటున్న ఈ ఇష్టం కారణంగా ముందుముందు మధు సాకేత్ పట్ల అయిష్టత పెంచుకుంటుందేమోనని భయంగా ఉంది. ఎన్నో సంవత్సరాల నుండీ అనుకుంటున్న ఈ వివాహం ఆగిపోతే మా కుటుంబాలలో అల్లకల్లోలం, అశాంతి చెలరేగుతాయి. అందరూ విపరీతంగా బాధ



పడతారు. నీ విషయానికి వస్తే, మధుతో నీ సాహచర్యం కేవలం ఒక పది మాసాలది. మరచిపోడానికి కొద్దిరోజులు బాధపడ్డా, క్రమేణా జీవితాన్ని సరైన బాటలో మలచుకునే కార్యక్రమంలో ఆ బాధ వెనకబడిపోతుంది. మధు విషయంలో కూడా అదే జరుగుతుంది. జీవితం, కుటుంబం, అనుబంధాలు- ఇవన్నీ తాత్కాలిక ఇష్టాయిష్టాల కంటే ఎంతో విలువైనవి. చదువుకున్నవాడివి, సంస్కారవంతుడివి. నీకింతకన్నా చెప్పడం నాకిష్టం లేదు. దయచేసి మధు జీవితంలో నుంచి నువ్వు తప్పుకుంటావని ఆశిస్తున్నాను.''

ఆపైన హేమంత్ సమాధానానికి కూడా వేచి చూడకుండా ఆయన వెళ్ళిపోయారు.

హేమంత్ ఆ రాత్రంతా ఆలోచిస్తూనే ఉన్నాడు. మధుమిత మీద పెంచుకున్న తన అనురాగాన్నీ, వాళ్ళ కుటుంబం ఆమె మీద పెట్టుకున్న ఆశలూ, నమ్మకాల్నీ రాత్రంతా తరాజు వేస్తూనే ఉన్నాడు. చివరకు ఒక నిర్ణయానికొచ్చాడు. మళ్ళీ పొద్దుటే మధుమిత ముఖం చూస్తే తన నిర్ణయం ఎక్కడ సడలిపోతుందో అని, తెల్లవారుజామునే ఎవరూ లేవకమునుపే తన సామానంతా సర్దుకుని, తన ఊరు వెళ్ళిపోతున్నానని మధుమిత నాన్నగారి పేర లేఖ రాసిపెట్టి, ఒక ఆటో తీసుకుని ఊర్లోనే ఉన్న స్నేహితుడి ఇంటికి వెళ్ళిపోయాడు. ఆ సాయంత్రమే ఫ్లైట్‌లో ఢిల్లీకి వెళ్ళిపోయాడు. తిరిగి మధుమితని చూడ్డం కానీ, కలవడం కానీ ఈరోజే!

★ ★ ★

''ఎంతసేపలా ఆలోచిస్తూ కూర్చుంటావు సమాధానం చెప్పకుండా?'' మధుమిత భుజం తట్టుతూ పలకరించేసరికి ఊహల్లోనుంచి ఒక్కసారి బయటపడ్డాడు హేమంత్.

''సమాధానం చెప్పకపోతే పోనీలే. ఎలానూ గడచిపోయిన రోజులు తిరిగిరావుగా. కనీసం ఇప్పుడైనా కొద్దిసేపు కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ గడుపుదాం.''

'అదీ మధుమితలోని గొప్పతనం. ఏ విషయాన్నీ ఎదుటివారికి ఇబ్బంది కలిగించేదాకా లాగదు' నిట్టూరుస్తూ అనుకున్నాడు హేమంత్.

మరికొద్దిసేపు పాత స్మృతులు నెమరేసుకున్నాక ''ఇక బయల్దేరుదామా?'' అని మధుమిత అనేసరికి ఇద్దరూ మాల్ నుంచి బయటపడ్డారు. మధుమిత తన కారు డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళిపోయింది. హేమంత్ ఒక టాక్సీ ఎంగేజ్ చేసుకున్నాడు తన నివాసానికి వెళ్ళడానికి.

టాక్సీలో వెళుతుండగా అనుకున్నాడు హేమంత్- 'మధుమితకి తనమీద ఇంకా కోపం పోయినట్టు లేదు. ఇంటికి రమ్మని కూడా పిలవలేదు. ఫోన్ నంబరైనా ఇవ్వలేదు, తీసుకోలేదు. అవును, ఎలా క్షమిస్తుంది, అంత దారుణంగా మొహం చాటేశాక. తను పచ్చి మోసగాడు అనుకుని ఉంటుంది. అందుకే దేవుడు తనకి సరైన శిక్ష వేశాడు- పెళ్ళయిన రెండేళ్ళకే తన భార్యని తన దగ్గర నుండి తీసుకొనిపోయి, తనని ఒంటరిని చేసి. ఆ మాట చెబితే తనెక్కడ బాధపడుతుందో అని పెళ్ళి విషయంలో ముక్తసరిగా జవాబిచ్చాడు.'

అదే సమయంలో చెమర్చిన కళ్ళను తుడుచుకుంటూ అనుకుంటోంది మధుమిత 'యూ ఆర్ గ్రేట్ హేమంత్! ఇప్పటికీ మారలేదు- ఎవరినీ ద్వేషించలేని, నిందించలేని నీ మనస్తత్వం. మనం విడిపోడానికి మా నాన్నగారే కారణమని నాకు తెలియదనుకుంటున్నావు. పెళ్ళయిన మూడేళ్ళకే యాక్సిడెంట్‌లో సాకేత్ మరణించి, నా జీవితం చిందరవందరైపోతే, తను చేసిన పనికి కుంగిపోతూ నాన్నగారే ఆరోజు నీ గదిలో చోటుచేసుకున్న సంఘటన నాకు చెప్పారని నీకు తెలియదు. ఇప్పుడు నిన్ను ఇంటికి ఆహ్వానిస్తే మోడువారిన నా జీవితం చూసి నువ్వెంత బాధపడతావో నాకు తెలుసు. అందుకే నిన్ను ఇంటికి రమ్మని కూడా పిలవలేకపోయాను హేమంత్.' ★



# ఊరంతా నెమళ్లే!

**ఊళ్లల్లో ఇళ్లముందూ పశువుల పాకల్లో పెంపుడు కోళ్లు తిరుగుతున్నట్లే అక్కడి ఇళ్లముందూ వీధుల్లోనూ నెమళ్లు స్వేచ్ఛగా విహరిస్తుంటాయి. రోడ్డుపక్కన చింత చెట్ల నీడలో సేదతీరుతూ వచ్చిపోయేవాళ్లను పలకరిస్తుంటాయి. వానజాడ కనబడగానే పురివిప్పి నాట్యమాడుతుంటాయి. మరీ హుషారొస్తే చెట్టుకొమ్మల మీదకి ఎగిరి దూకుతుంటాయి. ఇలా ఆ ఊళ్లో ఎటు చూసినా నెమళ్ల సందడే... దాని పేరే మొరాచీ చించోలీ.**



పుణెకి సుమారు 55 కి.మీ. సమీపంలో ఉన్న పచ్చని కొండల మధ్యలో కొలువుతీరిన అందమైన గ్రామమే మొరాచీ చించోలీ. చింత చెట్ల గ్రామంగానూ నెమళ్లు నాట్యమాడే పట్టణంగానూ పేరొందింది. మోర్ అంటే మరాఠీలో నెమలి అనీ, చించ్ అంటే చింత చెట్టు అనీ అర్థం. ఆ రెండింటికీ ఆ ఊరు పెట్టింది పేరు. అందుకే వాటి పేర్లతోనే ఆ గ్రామం ప్రాచుర్యం చెందింది. పేష్వాల కాలంలో అక్కడ నాటిన ఆ చింతచెట్ల నుంచి వచ్చే చల్లని గాలీ, నీడలతోబాటు గ్రామీణుల పక్షి ప్రేమ కారణంగా అక్కడ నెమళ్ల సంతతి క్రమంగా వృద్ధి చెందింది. దాంతో అందాల మయూరాలను చూసేందుకు పక్షి ప్రేమికులు ఆ ఊరి బాట పడుతున్నారు.

ఊళ్లోకి వెళ్లగానే నెమళ్లు గుంపులుగా తిరుగుతూ దూరం నుంచే స్వాగతిస్తాయి. ఒకలాంటి బెరుకుతో ఆ చుట్టుపక్కలే తిరుగుతుంటాయి కానీ దగ్గరకు రావు. అదే ఆ గ్రామీణుల దగ్గరయితే భయపడవు సరికదా, వాళ్ల పక్కనే కూర్చోవడం, వాళ్లు అందించే ఆహారాన్ని తినడం చేస్తుంటాయి. నిజానికి ఆ ఊరి జనాభాకన్నా నెమళ్ల జనాభానే ఎక్కువ. సుమారు రెండువేలా ఐదొందల మయూరాలు ఆ ఊళ్లో హాయిగా జీవిస్తున్నాయి.

### ఆదర్శగ్రామం!

నెమళ్ల పరిరక్షణను ఆ గ్రామీణులు స్వచ్ఛందంగా చేపట్టారు. అందుకే దాదాపు 1365 ఎకరాలతో కూడిన ఆ గ్రామాన్ని



'పీకాక్ శాంక్చ్యువరీ'గా చెప్పవచ్చు. సజ్జ, జొన్న, పొద్దుతిరుగుడు, కూరగాయలు, దానిమ్మ... ఇలా స్థానికంగా పండించే పంటలన్నీ నెమళ్లకు ఆహారమే. అవి తినగా మిగిలిన గింజలనే వాళ్లు కోసుకుంటారు. ప్రతిగా అవి పాముల్నీ పంటలకు నాశనం కలిగించే హానికర క్రిముల్నీ తినడం ద్వారా రైతులకు మేలు చేస్తుంటాయి. పొలాల్లో గింజలులేని సమయాల్లో గ్రామీణులే బంగాళాదుంపలు, ఉల్లిపాయలు, నువ్వులు... ఇలా నెమళ్లు ఇష్టంగా తినేవాటిని మేతగా వేస్తుంటారు. వాటి స్వేచ్ఛకు ఎంతమాత్రం భంగం కలిగించరు సరికదా, ఎంతో ప్రేమగా సంరక్షిస్తుంటారు. పర్యటకుల్ని సైతం గ్రామపరిసరాల్లో సిగరెట్లు కాల్చనివ్వరు, మద్యం తీసుకోనివ్వరు, పొరబాటున కూడా వాటికి వాళ్లు హాని తలపెట్టరు, ఎవరినీ తలపెట్టనీయరు. ఒక్క ముక్కలో చెప్పాలంటే 1972 నాటి భారతీయ వన్యప్రాణుల చట్టాన్ని తు.చ. తప్పక ఆచరించే ఆదర్శగ్రామం అది.

నెమళ్లను చూడ్డానికి వచ్చే సందర్శకుల సంఖ్య క్రమంగా పెరుగుతుండటంతో అక్కడ



ఆగ్రోటూరిజాన్నీ అభివృద్ధి చేశారు. అందులో భాగంగా గ్రామీణ ఆతిథ్యాన్ని అందిస్తూ వ్యవసాయ క్షేత్ర పర్యటనలనీ గ్రామీణ క్రీడలనీ నిర్వహిస్తున్నారు. అంటే పర్యటకులు గ్రామీణుల ఇంట్లోనే బస చేసి, వాళ్లు పెట్టే భోజనం తిని, ఎడ్లబండ్లమీదా ట్రాక్టర్లలోనూ షికార్లు కొట్టొచ్చు. గింజలకోత, నూర్పిడి... వంటి పొలంపనుల్నీ చూడొచ్చు. స్థానికుల ఇళ్లలో కాకుండా గ్రామీణ నేపథ్యంలోనే ప్రత్యేకంగా గదులు కావాలనుకునేవాళ్లకోసం అన్ని వసతులతో కూడిన కాటేజీలూ ఉన్నాయి. పిల్లలకోసం తోలుబొమ్మలాట, మ్యాజిక్... వంటి వినోదకార్యక్రమాలతో కూడిన ఉద్యానవనాన్నీ ఏర్పాటుచేశారు. రాత్రివేళలో అడవి అందాలను ఆస్వాదించాలనుకునే వాళ్లకోసం క్యాంపింగ్ సౌకర్యమూ ఉంది. మొత్తమ్మీద స్వేచ్ఛగా తిరిగే నాట్యమయూరాలతోబాటు స్థానికులు అందించే మర్యాదలతో కూడిన ఆతిథ్యం కారణంగానే ఆ గ్రామం నిత్యం సందర్శకులతో కళకళలాడుతోంది. ★



# మీ ఇంటికొస్తాం... నట్టింటికొస్తాం..!

ఏడాదిలో ఎప్పుడో ఒకటీ రెండు సినిమాలు విడుదలైతేనే పెద్ద హీరోల అభిమానులకు పెద్ద పండుగ వచ్చినంత సంబరం. అలాంటిది వాళ్లు ప్రేక్షకులకు మరింత దగ్గరగా టీవీల్లో సరికొత్తగా కనిపిస్తుంటే ఆ సంబరాలు అంబరాన్ని దాటిపోవూ..! జూనియర్ ఎన్టీఆర్ వ్యాఖ్యాతగా చేస్తున్న బిగ్‌బాస్ షో ప్రతి ప్రోమో యూట్యూబ్‌లో విడుదలైన ఒకటీ రెండు రోజుల్లోనే లక్షల వ్యూస్ సాధించిందంటేనే ఆ విషయాన్ని అర్థం చేసుకోవచ్చు. నంబర్ వన్ యారీతో రానా కూడా మరోవైపు దుమ్ము దులిపేస్తున్నాడు. ఇలా పెద్ద హీరోలు బుల్లితెరమీదికి రావడం ఇప్పుడో ట్రెండ్ అయిపోయింది. ఆ కథేంటో చూద్దామా మరి..!

## బిగ్ 'బాస్' ఎన్టీఆర్

హాలీవుడ్‌లో 'బిగ్ బ్రదర్'గా ప్రాచుర్యం పొంది బాలీవుడ్‌కి వచ్చిన బిగ్‌బాస్ షో అక్కడ పదకొండేళ్లుగా వీక్షకులను టీవీలకు కట్టిపడేసేలా చేసింది. కొంతమంది సెలెబ్రిటీలను 70 రోజులపాటు ఓ ఇంట్లో ఉంచి వారి దినచర్యను వీక్షకులకు చూపించేలా లోపలంతా సీసీ కెమేరాలు పెడతారు. ఆ ఇంట్లోకి టీవీ, ఫోన్, ల్యాప్‌టాప్ లాంటి వేటినీ అనుమతించరు. అంటే వారికి బయటి ప్రపంచంతో ఎలాంటి సంబంధమూ ఉండదు. తెలుగులో త్వరలో వస్తున్న ఈ షోకి వ్యాఖ్యాతగా జూనియర్ ఎన్టీఆర్ తొలిసారి బుల్లితెరమీద కనిపించబోతున్నారు. సినిమాల్లోనే కాదు, మామూలుగా కూడా ఎన్టీఆర్ మాట్లాడేటపుడు సందర్భానికి తగ్గట్లూ పంచ్ డైలాగులూ జోకులతో అందరినీ ఆకట్టుకుంటూ ఉంటారు. ఇక, యంగ్ టైగర్‌కి అభిమానుల్లో ఉన్న ఇమేజ్ గురించి ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు. అందుకే, బిగ్‌బాస్‌ని విజయవంతం చేసే బాధ్యతను ఈ హీరోకి అప్పగించారు మా టీవీ నిర్వాహకులు. ఎన్టీఆర్ కూడా ఎంతో ప్రతిష్ఠాత్మకంగా తీసుకుని చేస్తున్న ఈ షోకి సంబంధించిన ప్రోమోలన్నీ లక్షల వ్యూస్ సాధించి ఇంటర్నెట్‌లో సంచలనం సృష్టిస్తున్నాయి.



## తమిళంలో బాస్ కమల్ హాసన్

యాభై ఏళ్ల నుంచి సినిమాల్లో నటిస్తున్న కమల్ హాసన్‌ని తొలిసారి టీవీ తెరమీదికి తీసుకొచ్చిన ఘనత కూడా బిగ్‌బాస్ షోదే. టాలీవుడ్‌తో పాటు బాలీవుడ్‌లోనూ ఎంతోమందికి అభిమాన నాయకుడైన కమల్ తమిళులకు ఆరాధ్యదైవం లాంటి వాడు. అక్కడ బిగ్‌బాస్ షోకి ప్రాచుర్యం తీసుకురావాలంటే ఆయనే కరెక్ట్ అని భావించింది స్థానిక విజయ్ ఛానెల్ యాజమాన్యం. అందుకు తగ్గట్లే కొన్నిరోజుల కిందట ప్రారంభమైన తమిళ బిగ్‌బాస్‌కు ఓ స్థాయిలో రేటింగ్స్ తెచ్చిపెడుతున్నాడు కమల్‌హాసన్. 'ఇప్పుడు ప్రపంచం అంతా స్మార్ట్ తెరల చుట్టూనే తిరుగుతోంది. అందుకే మూడు గంటలుండే సినిమా కన్నా రోజూ టీవీల్లో వచ్చే కార్యక్రమాలూ వీడియోలూ ఎక్కువ ప్రాచుర్యం పొందుతున్నాయి. ఈ కారణంతోనే మరింత ఎక్కువమందికి చేరువవ్వాలనే ఉద్దేశంతో బిగ్‌బాస్‌కి ఒప్పుకున్నా. ఇప్పుడు ప్రతి శనివారం కొన్ని కోట్లమంది ముందుకు రాగలగుతున్నా. అదే బుల్లితెరకున్న ప్రత్యేకత' అంటారు కమల్‌హాసన్.

## కండల వీరుడే ఆ షో హీరో

పదకొండేళ్లుగా హిందీలో ప్రసారం అవుతున్న బిగ్‌బాస్ భారత్‌లో ఎంతగానో ప్రాచుర్యం పొందిన షోలలో ఒకటి. మొదట దీనికి అర్షద్ వార్సి, శిల్పాశెట్టి, అమితాబ్ బచ్చన్, సంజయ్ దత్ వ్యాఖ్యాతలుగా చేశారు. 2012 నుంచి సూపర్ స్టార్ సల్మాన్ ఖాన్ బిగ్‌బాస్‌ని సూపర్‌గా నడిపిస్తున్నారు. అందుకే, కలర్స్ ఛానల్ ఈ హీరోకి ఒక్కో ఎపిసోడ్‌కీ దాదాపు రూ. 8కోట్ల పారితోషికాన్ని చెల్లిస్తోందట.

## కన్నడలో బిగ్‌హిట్

ఈటీవీ కన్నడలో 2013లోనే ప్రారంభమైన బిగ్‌బాస్ షో దక్షిణాదిలోనే నంబర్ వన్ రియాలిటీ షోగా రికార్డుకెక్కింది. దీనికి వ్యాఖ్యాత ఎవరో తెలుసా ఈగ సినిమా నటుడూ శాండల్ వుడ్ సూపర్ స్టార్ సుదీప్. ఈ హీరో మీద కన్నడిగులకు ఎంత అభిమానం ఉందంటే బిగ్‌బాస్ మొదలైనప్పట్నుంచీ ఇప్పటివరకూ అతడే దీనికి వ్యాఖ్యాతగా కొనసాగుతున్నాడు. ఈటీవీ తర్వాత స్టార్ సువర్ణ, కలర్స్ కన్నడ ఛానళ్లలో ప్రసారమైన ఈ షోకి వ్యతిరేకంగా స్థానిక నిర్మాతలు ఆమధ్య నిరసన కార్యక్రమం కూడా చేపట్టారు. ఎందుకంటే బిగ్‌బాస్ షోకి మరీ ప్రాచుర్యం రావడంతో అక్కడ సినిమాలు కూడా సరిగా ఆడటం లేదట మరి.

## ఇది బిగ్ బీ షో..!

కౌన్‌బనేగా కరోడ్‌పతి... భారతదేశ టీవీ షోల చరిత్రలోనే ఓ ప్రభంజనం. బ్రిటన్‌లో ప్రాచుర్యం పొందిన 'హూ వాంట్స్ టు బీ ఏ మిలియనీర్' ఆధారంగా 2000 సంవత్సరంలో ప్రారంభమైన ఈ షో బాలీవుడ్ సూపర్ స్టార్ అమితాబ్ బచ్చన్‌ని టీవీ తెరమీదికి తీసుకొచ్చింది. అప్పట్నుంచి ఇప్పటి వరకూ పదిహేడేళ్లలో ఒక్క సీజన్‌కి మినహా అన్నిటికీ బిగ్ బీనే వ్యాఖ్యాత. ఆ షో ప్రారంభమైందంటే మిగిలిన ఛానెళ్లలో ప్రోగ్రామ్‌ల రేటింగులు వైకుంఠపాళీలో పాము మింగినంత వేగంగా కిందికొచ్చేస్తాయంటారు. అమితాబ్ క్రేజ్ అలాంటిది. మధ్యలో 2007లో అమితాబ్‌కి ఆరోగ్యం బాగా లేకపోవడంతో మూడో సీజన్‌ని షారూఖ్ ఖాన్‌తో చేయించారు. కానీ అది ప్రేక్షకుల్ని ఆకట్టుకోలేకపోయింది. దాంతో నాలుగో సీజన్‌కి మళ్లీ అమితాబ్ తెరమీదకి వచ్చారు. ఈ ఆగస్టులో తొమ్మిదో సీజన్ ప్రారంభం కాబోతోంది. దీనికీ వ్యాఖ్యాత ఆయనే.



## 'మెగా' సందడి

ఖైదీ నం. 150తో నూటయాభయ్యో సినిమాలోనూ తన పవరేంటో నిరూపించారు మెగాస్టార్ చిరంజీవి. తెలుగు ప్రేక్షకులకు ఆయన నటనంటే అంత మక్కువ మరి. అందుకే, నాగార్జున తర్వాత 'మీలో ఎవరు కోటీశ్వరుడు' షోని నడిపించేందుకు చిరంజీవిని రంగంలోకి దించింది స్టార్ మా యాజమాన్యం. అలా తొలిసారి బుల్లితెర మీద కనిపించి తనలోని వ్యాఖ్యాతను కూడా అభిమానులకు పరిచయం చేశాడు మెగాస్టార్.






## తొలి అడుగు మన్మథుడిదే!

తెలుగులో పెద్ద తారలు వ్యాఖాతగా బుల్లితెరమీద కనిపించడం నాగార్జునతోనే మొదలైంది. టాలీవుడ్ అగ్ర కథానాయకుల్లో ఒకడైన నాగ్‌కి మహిళా ప్రేక్షకులూ మాస్ వైపు నుంచి కూడా అభిమానులున్నారు. దాంతో హిందీలో ఎంతో ప్రాచుర్యం పొందిన 'కౌన్ బనేగా కరోడ్‌పతి' తెలుగు వెర్షన్‌కి వెండి తెర మన్మథుడిని వ్యాఖ్యాతగా బుల్లితెరకు పరిచయం చేశారు ఆ షో నిర్మాతలు. 'మీలో ఎవరు కోటీశ్వరుడు' గేమ్ షో మొదటి సీజన్‌ని నాలుగు కోట్లమందికి పైగా చూశారంటేనే ఆ ప్రయత్నం ఫలితం ఎలా ఉందో అర్థం చేసుకోవచ్చు. నాగార్జున చేసిన రెండు మూడు సీజన్‌లు కూడా విజయవంతంగా నడిచాయి.



## ఆ ముగ్గురూ...

తమిళ ఛానల్ స్టార్ విజయ్‌లో 2012లో ప్రారంభమైన కౌన్ బనేగా కరోడ్‌పతి కూడా అక్కడి పెద్ద హీరోల్ని టీవీ తెరమీదికి తెసుకొచ్చింది. 'నీంగలుమ్ వెల్లలామ్ ఒరు కోడి(మీరూ గెలవొచ్చు కోటి రూపాయలు)' పేరుతో అక్కడ ప్రసారమవుతున్న ఈ షో మొదటి సీజన్‌కు హీరో సూర్య, తరవాత ప్రకాష్ రాజ్ మూడో సీజన్‌కు అరవింద్ స్వామి వ్యాఖ్యాతలుగా వచ్చారు. తమ నటనతో తమిళంతో పాటు తెలుగులో బాలీవుడ్‌లో కూడా అభిమానులను సంపాదించుకున్న ఈ ముగ్గురూ ఆ షోని విజయవంతంగా నడిపించారు. సూర్య సినిమాలతో బిజీగా ఉండడంతో రెండో సీజన్‌ని ప్రకాష్ రాజ్ చేశాడు. ఇక, గతేడాది వచ్చిన అరవింద్ స్వామి వ్యాఖ్యాతగా చేసిన మూడో సీజన్ మొదటి ఎపిసోడ్‌ని యాభై లక్షల మంది చూశారంటేనే అతడికున్న క్రేజ్ అర్థం చేసుకోవచ్చు.






## నంబర్ వన్ యారీ...

దేశవ్యాప్తంగా, ఇతర దేశాల్లోనూ మారుమోగిపోయిన బాహుబలి సినిమాలో హీరో పాత్రకు దీటైన మరో పాత్ర భల్లాల దేవుడిది. ఈ సినిమాతో రానాకి పెరిగిన క్రేజ్ అంతా ఇంతా కాదు. అలాంటి నటుడు బుల్లి తెరమీద షో చేస్తున్నాడంటే అభిమానులకు పండుగలా ఉండదూ... జెమినీ టీవీలో ప్రసారం అవుతున్న 'నంబర్ వన్ యారీ'లో సెలెబ్రిటీ స్నేహితుల ముచ్చట్లూ సినీతారల వ్యక్తిగత జీవితంలోని ఆసక్తికర విషయాల్నీ ప్రేక్షకులముందుకు తెస్తున్నాడు రానా.

అదండీ సంగతి... ఈ ట్రెండ్ ఇలానే కొనసాగితే ముందు ముందు మహేష్, ప్రభాస్, పవన్ కళ్యాణ్ లాంటి స్టార్లను కూడా టీవీ తెరమీద చూడొచ్చేమో.

# వెదురు అందాలు... తెరలుతెరలుగా

**గుమ్మంలోనే గణపతి సాక్షాత్కరిస్తే... కిటికీలమీద సీతాకోకచిలుకలూ పక్షులూ ఎగురుతుంటే... గోడమీద సుందర ప్రకృతిదృశ్యం ఆవిష్కృతమయితే... అదీ వెదురు పరదాలమీద అందంగా కొలువుదీరితే... ఎంత అద్భుతంగా ఉంటుందో ఒకసారి చూద్దామా..!**





ఇంటికొచ్చిన అతిథుల్ని గుమ్మంలోనే చిత్తరువుల్ని చేయాలంటే వెదురు చిత్రాల కర్టెన్లను వేలాడదీయాల్సిందే అంటున్నారు నేటి గృహాలంకరణ ప్రియులు. అవునుమరి, ఇంటి అలంకరణలో పరదాల ప్రాధాన్యం రోజురోజుకీ పెరుగుతోంది. అయితే వాటిల్లో భిన్న ఫ్యాబ్రిక్కుల్ని విభిన్న డిజైన్లలో కుట్టిన వాటిదే నేటివరకూ హవా. కానీ ఇప్పుడు వెదురు కర్టెన్లూ వేలాడుతున్నాయి.

## ఎంతో కష్టం!

మిగిలిన ప్రాంతాలతో పోలిస్తే, మనదేశంలోని ఈశాన్య రాష్ట్రాల్లోనూ తూర్పు ఆసియా దేశాల్లోనూ వెదురు వస్తువుల వాడకం ఎక్కువ. ఆన్‌లైన్ పుణ్యమా అని ఇప్పుడు అక్కడ తయారుచేసినవన్నీ మనకీ అందుబాటులోకి వస్తున్నాయి. ఈ వెదురు చిత్రాల పరదాలు కూడా అలా వచ్చినవే. చైనా, వియత్నాం, జపాన్... వంటి దేశాల్లో సన్నని పొడవాటి వెదురు పూసల్ని గుదిగుచ్చి రూపొందించిన వెదురు కర్టెన్లమీద చేత్తో అందమైన చిత్రాల్ని చిత్రించడం ఆయా కళాకారులకు వెన్నతో పెట్టిన విద్య. నిజానికి వెదురుపూసల మీద బొమ్మలేయడం అనేది కష్టసాధ్యం. ఎందుకంటే దీనిమీద చిత్రం గీయడం అంటే ఏదో వస్త్రం మీదనో కాగితంమీదో వేసినట్లుగా కాదు, కుంచెతో రంగులు తీసుకుని వేసేటప్పుడు ఆ పూసలు అటూ ఇటూ కదులుతూ ఉంటాయి. అందువల్ల గీతగీసి రంగుల్ని అద్దేటప్పుడు ప్రతీసారీ పూసను గుండ్రంగా తిప్పుతూ ఒకే కోణంలో ఉండేలా సరిచూసుకుంటూ ఎంతో ఓర్పునేర్పులతో చిత్రించాల్సి ఉంటుంది. దాంతో ఈ రకమైన కర్టెన్లమీద చిత్రించే చిత్రం రెండువైపులా కనిపిస్తుంది. అందునా వెదురు పూసలమీద వ్యక్తుల బొమ్మల్ని చిత్రించడం మరీ కష్టం.





గతంలో ఎక్కువగా ఆయా దేశాల్లోని సుందరప్రకృతి దృశ్యాలూ వాళ్ల సంస్కృతికి అద్దం పట్టే చిత్రాలూ జంతువులూ వ్యక్తుల బొమ్మల్ని మాత్రమే వీటిమీద చిత్రించేవారు. ఇప్పుడు విభిన్న దేశాలకు చెందిన సంస్కృతీసంప్రదాయాలకు అద్దంపట్టే బొమ్మల్ని కూడా వేస్తూ ఆన్‌లైన్ దుకాణాల ద్వారా ప్రపంచవ్యాప్తంగా గృహాలంకరణ ప్రియుల్ని ఆకట్టుకుంటున్నారు. వీటిని గుమ్మాలకూ కిటికీలకూ పరదాలుగా మాత్రమే కాదు, హాలూ, లివింగ్‌రూము... వంటి వాటిని రెండుగా విభజించే డివైడర్లుగానూ వాడుకోవచ్చు. గోడలకు చిత్రపటంలానూ అలంకరించుకోవచ్చు. ఆర్డరు చేస్తే కావలసిన సైజుల్లో వెదురు కర్టెన్లను రూపొందించి అందిస్తున్నాయి ఆయా వెబ్‌సైట్ దుకాణాలు. ఈ రకమైన కర్టెన్లలో సాధారణంగా 90- 140 పూసల వరసలు ఉంటాయి. ఈ వరసలు ఎంత ఎక్కువగా ఉంటే దాని మీద వేసిన చిత్రానికి అంత అందం వస్తుంది. అందుకే కొనుక్కునేటప్పుడు ఎక్కువ వరసలు ఉండి వెడల్పుగా ఉండేవే కొనుక్కోవాలి. అలాగే వీటిమీద కాంతి పడుతుంటే మరింత ప్రకాశవంతంగా కనిపిస్తాయి. కిటికీల్లో నుంచి ఎండ లోపలకు రాకుండా ఉండాలన్నా, అవతలి దృశ్యం కనిపించకుండా- అంటే, కాస్త ప్రైవసీ కావాలనుకున్నా ఈ వెదురు కర్టెన్లు ఎంతో మేలు. మరి మీకూ నచ్చాయా... ఈ చిత్రాల వెదురు పరదాలు! 






ఏవండీ... ఆఫీసులో మీరు పండించిన పాలకూర, కొత్తిమీర బాగా పెరిగాయన్నారుగా... సాయంత్రం వచ్చేటపుడు మర్చిపోకుండా కోసుకురండి. రేపు పప్పూ, పచ్చడీ చేస్తా... మామూలుగా అయితే ఉద్యోగానికి వెళ్లేవారికి ఎవరూ ఇలా చెప్పరు. కానీ బెంగళూరు, మాన్యత బిజినెస్ పార్కు సంస్థ భవనాల్లో ఉన్న వివిధ కంపెనీల ఉద్యోగులు రోజూ ఇలాంటి మాటలు వింటూనే ఉంటారు. ఎందుకంటే... వాళ్లు కార్యాలయం ఎదురుగా ఉన్న మడుల్లో ఇంటికి కావల్సిన కూరగాయలు పండించుకుంటున్నారు కాబట్టి.

# ఆఫీసులో వ్యవసాయం

కార్పొరేట్ సంస్థల్లో కొలువులు. ఏసీ గదుల్లో పనులు. వేలూ లక్షల్లో జీతాలు. అయినా మట్టివాసనను పీల్చినపుడూ పచ్చని మొక్కల మధ్య గడిపినపుడూ దొరికే మానసికానందం కోసం వెతుకులాట ఆగదు. ఆ అనుభవాన్ని పొందాలంటే మొక్కల్ని పెంచుకోవాలి. కానీ నగరాల్లో కాస్త పెద్ద బాల్కనీ ఉన్న ఇల్లు దొరకడమే మహద్భాగ్యం. అందులోకి సూర్యుడి కిరణాలు చొరబడగలగడం ఇంకా గొప్ప విషయం. మరో పక్కేమో ప్రతి కూరగాయనూ కొనుక్కోవాల్సిందే. క్రిమిసంహారక మందుల వాడకం పెరిగిపోవడంతో అంత డబ్బు పోసినా ఆరోగ్యకరమైన ఆహారం తింటున్నామనే నమ్మకం ఉండదు. బెంగళూరులోని 'మాన్యత ఎంబసీ బిజినెస్ పార్కు'లో హార్టీకల్చర్ మేనేజర్‌గా పనిచేస్తున్న కిరణ్‌కీ ఇది అనుభవమే. ఆ పార్కులో 110 ఎకరాల స్థలంలో వివిధ కంపెనీల కార్యాలయాలను నిర్వహించేందుకు ఇరవైకి పైగా బహుళ అంతస్తుల భవనాలున్నాయి. వాటి మధ్యలో అక్కడక్కడా కలిపి దాదాపు పదిహేను ఎకరాల స్థలం వృథాగా ఉండిపోయింది. ఆ స్థలాన్ని చిన్న చిన్న మడులుగా చేసి ఉద్యోగులు సాగు చేసుకునేందుకు ఉచితంగా ఇద్దామనే ప్రతిపాదన తెచ్చాడు కిరణ్. అది అందరికీ నచ్చడంతో గతేడాది 'అర్బన్ గ్రీన్' పేరుతో ఈ కార్యక్రమం అమల్లోకి వచ్చింది. మాన్యత ప్రాంగణంలోని వేరు వేరు భవనాల్లో ఉన్న నోకియా, ఐబీఎమ్, కాగ్నిజెంట్... లాంటి కంపెనీల్లో వేలమంది ఉద్యోగులు పనిచేస్తున్నారు. వారిని మడులకోసం దరఖాస్తు చేసుకోమని కోరగా చాలామంది ముందుకొచ్చారు. దాంతో మూడు భవనాల ఎదురుగా ఉన్న స్థలాన్ని 170 మడులుగా చేసి, దరఖాస్తు చేసుకున్న వారిలో కొందరికి మూడు నెలలపాటు నచ్చిన కూరగాయలూ ఆకు కూరల్ని పెంచుకునే అవకాశం కల్పించారు అర్బన్ గ్రీన్ నిర్వాహకులు. కావల్సిన కూరగాయల విత్తనాలను కూడా వాళ్లే ఉచితంగా పంచారు. ఉద్యోగులు ఆఫీసు విరామ సమయంలో వచ్చి విత్తనాలు చల్లుకోవడం, మొక్కలకు నీళ్లు పొయ్యడం లాంటివి చేసుకోవచ్చు. వారికి సాయం చేసేందుకూ వాళ్లు సెలవుల్లో ఉన్నపుడు మొక్కల్ని చూసుకునేందుకూ పనివాళ్లుంటారు. తమకిచ్చిన స్థలంలో కొందరు ఉద్యోగులు పాలకూర, తోటకూర, కొత్తిమీర లాంటివి వేసుకుంటే మరికొందరు టొమాటో, పచ్చిమిర్చి, వంగ, బేబీకార్న్ లాంటివాటిని సాగు చెయ్యడం మొదలుపెట్టారు. సొంతంగా పెంచుకున్న మొక్కలూ వాటినుంచి సహజసిద్ధంగా పండే కూరగాయల్నీ చూశాక ఉద్యోగి రైతన్నల ఆనందం మరింత పెరిగింది.



## ఎంత బాగుందో...

'రైతు బిడ్డగా సొంత పొలం నుంచి తెచ్చుకుని వండుకునే కూరగాయల రుచీ ఆ అనుభవం ఎలా ఉంటాయో తెలుసు. ఉద్యోగంలో చేరాక ఆ అవకాశం లేదని ఎన్నోసార్లు బాధపడ్డా. కానీ ఇప్పుడు నాకిచ్చిన మడిలో స్వయంగా పాలకూర, టొమాటోలను పండించి మా ఇంటికి తీసుకెళ్లడంతో పాటు ఆఫీసులో సహచరులక్కూడా ఇస్తున్నా. వాళ్లు పండించినవి నాకూ ఇస్తున్నారు. ఇదంతా ఎంత బాగుందో' అంటాడు నోకియా సంస్థలో పనిచేసే మల్లికార్జున్‌రెడ్డి. 'ఒకేచోట పనిచేసే ఉద్యోగులకు పక్క పక్క మడుల్ని కేటాయించినపుడు ఒక్కొక్కరం ఒక్కో రకం కూరగాయల్ని పండించుకుంటూ అందరం పంచుకోవడం ఇంకా బాగుంది...' అంటాడు మరో ఉద్యోగి. ఈ మడుల్ని చూసుకునే సిబ్బంది ఎప్పటికప్పుడు రాలిన ఆకుల్నీ పీకేసిన కలుపు మొక్కల్నీ ఏరి భూమిలో పాతి సేంద్రియ ఎరువుగా మారుస్తారు. దాన్నే ఉద్యోగులు ఆవుపేడతో కలిపి మొక్కలకు వేస్తారు.

## ఒత్తిడి దూరం

'ఉద్యోగులను ప్రకృతిలో మమేకం చేసి, ఒత్తిడిని దూరం చెయ్యడానికి జపాన్, బ్రిటన్‌లలో ఇప్పటికే ఆఫీసు సాగుని ప్రోత్సహిస్తున్నారు. మనమూ ఓసారి అలా ప్రయత్నిద్దాం అని అర్బన్ గ్రీన్‌ని ప్రోత్సహిస్తున్నాం' అంటారు మాన్యత ఎంబసీలో సీనియర్ కార్పొరేట్ మేనేజర్‌గా పనిచేసే గౌరవ్ భండారి. నిజమే. ఒకప్పుడు అక్కడి ఉద్యోగులు విరామ సమయాల్లో ఫోన్లు పట్టుకుని అటూ ఇటూ తిరిగేవారు. కానీ ఇప్పుడు ఖాళీ దొరికితే రైతుల అవతారం ఎత్తేస్తున్నారు. దీనివల్ల ఒత్తిడి దూరమవడమే కాదు, ఇతర కంపెనీల్లో పనిచేసేవారితోనూ పరిచయాలు ఏర్పడుతున్నాయి. ప్రస్తుతం ఎంబసీలో ఉన్న మూడు భవనాల ముందున్న స్థలాన్నే మూడునెలలకోసారి రొటేషన్ పద్ధతిలో కొత్తవారికి కేటాయిస్తున్నారు. మిగిలిన ఇరవై భవనాల ఎదురుగా ఉన్న స్థలం కూడా ఉపయోగంలోకి వస్తే ఒకేసారి ఎక్కువ మందికి సాగుచేసుకునే అవకాశం వస్తుందంటారు హార్టీకల్చర్ మేనేజర్ కిరణ్. ఒకప్పుడు మాన్యత బిజినెస్ పార్కులోకి అడుగు పెడితే ఎత్తైన భవనాలే కనిపించేవి. కానీ ఇప్పుడు దారికిరువైపులా పెరిగిన కూరగాయల మొక్కలు పొలంలోకి అడుగు పెట్టిన భావనను కలిగిస్తున్నాయి. ఎంత మంచి మార్పు..! ★



# 'హీరో' పోలీస్!

ప్రభుత్వోద్యోగం రాగానే జీవితంలో స్థిరపడిపోయినట్లు భావిస్తారు కొందరు. ఆ ఉద్యోగంతోనే సమాజం పట్ల తమ బాధ్యతలు పెరిగాయని గుర్తించి మరింత చైతన్యంతో నడచుకుంటారు మరికొందరు. హైదరాబాద్‌లోని రాచకొండ పోలీస్ కమిషనర్ **మహేశ్ మురళీధర్ భగవత్** రెండో రకానికి చెందుతారు. ఐపీఎస్ అధికారిగా ఆయన ఎక్కడ, ఏ పదవిలో ఉన్నా తనదైన ముద్ర చూపడమే కాదు, అందుకు గాను అంతర్జాతీయ స్థాయిలోనూ గుర్తింపు పొందారు. విధి నిర్వహణలో 'హీరో' అనిపించుకున్నారు.

మహిళలు, పిల్లల అక్రమ తరలింపు మన సమాజాన్ని పట్టిపీడిస్తున్న రుగ్మత. స్వేచ్ఛను హరిస్తూ మహిళల జీవించే హక్కును కాలరాస్తున్న ఈ ఆధునిక బానిసత్వానికి ఏ దేశమూ మినహాయింపు కాదు. ప్రపంచవ్యాప్తంగా ఒక వ్యవస్థీకృత నేరంగా వేళ్లూనుకున్న ఈ సమస్యను నిర్మూలించడానికి వివిధ మార్గాల్లో కృషిచేస్తున్న వ్యక్తులకు అమెరికా ప్రభుత్వం ఏటా హీరో పేరుతో అవార్డులిచ్చి సత్కరిస్తోంది. అక్రమ రవాణా సమస్య మీద వేర్వేరు దేశాల్లో పనిచేస్తున్న 8మందికి ఈ ఏడాది జూన్ చివరివారంలో వాషింగ్టన్ డీసీలో ఈ అవార్డులు ప్రకటించారు. వారిలో పోలీస్ శాఖ నుంచీ, మనదేశం నుంచీ ఎంపికైన వారు ఒక్కరే ఉండగా ఆ ఒక్కరూ తెలంగాణ రాష్ట్రానికి చెందిన ఐపీఎస్ అధికారి మహేశ్ మురళీధర్ భగవత్ కావడం విశేషం. గతంలోనూ పలుసార్లు ఇలాంటి అవార్డులు అందుకున్న మహేశ్ భగవత్‌ని అభినందించిన 'ఈనాడు ఆదివారం'తో ఆయన తన కెరీర్ విశేషాలను ఇలా పంచుకున్నారు...

## నిబద్ధతకు లభించిన గుర్తింపు

'ఇది నా ఒక్కడి విజయం కాదు. మా పోలీసు శాఖ కృషికి లభించిన గుర్తింపు. నాకన్నా ముందు గతంలో ఈ అవార్డును 2005లో ఢిల్లీ కమిషనర్ అమోద్ కాంత్, 2009లో అప్పటి ఐజీ ఉమాపతి, ప్రజ్వల సంస్థ నిర్వాహకురాలు సునీతాకృష్ణన్, బాలకార్మిక వ్యవస్థ నిర్మూలనకు కృషిచేస్తున్న కైలాశ్ సత్యార్థి అందుకున్నారు. వారి సరసన నేనూ చేరడం సంతోషం కలిగించింది. దాదాపు దశాబ్దకాలంగా నిబద్ధతతో కొనసాగిస్తున్న ఉద్యమమిది. ఎంత దారుణమైన పరిస్థితి అంటే... గ్లోబల్ స్లేవరీ ఇండెక్స్ నివేదిక ప్రకారం ప్రపంచవ్యాప్తంగా అక్రమరవాణాకి గురవుతున్నవారిలో 40శాతం భారతీయులే. 2004లో మొదటిసారి ఈ సమస్య నా దృష్టికి వచ్చినప్పటినుంచీ ఎక్కడికి వెళ్లినా ఇది నాకు ప్రథమ ప్రాధాన్యంగా మారింది. అమ్మాయిల్ని తరలించడానికి ఏకంగా పాఠశాల బస్సుల్ని ఉపయోగించడం చూసి నిజంగా ఎంత దిగ్భ్రాంతికి గురయ్యానో. సైబరాబాద్ డీసీపీగా పనిచేస్తున్నప్పుడు జరిగిందా సంఘటన. రాయదుర్గం పోలీస్ స్టేషన్ పరిధిలోని ఒక ఫార్మ్ హౌస్‌లో పార్టీ జరుగుతోందనీ ముంబయి, కోల్‌కతా లాంటి ప్రాంతాలనుంచీ అమ్మాయిల్ని తీసుకొచ్చి సిటీలో హోటళ్లలో ఉంచి స్కూలుబస్సులో పార్టీకోసం ఫార్మ్‌హౌస్‌కి తరలిస్తున్నారనీ సమాచారం అందింది. అప్పుడు నైట్ డ్యూటీలో ఉన్నాను. వెంటనే సిబ్బందితో రెయిడ్ చేసి వాళ్లను పట్టుకున్నాం. తీగ లాగితే డొంకంతా కదిలినట్లు పెద్ద ఎత్తున సాగుతున్న ఆ ముఠా వ్యవహారమంతా బయటపడింది. చాలామంది అమ్మాయిల్ని వారి బారినుంచి కాపాడి ఇళ్లకు పంపించాం. అప్పటినుంచీ ఈ సమస్యపై పరిశోధన కొనసాగించా.

తర్వాత నల్గొండ ఎస్పీగా చేసేటప్పుడు యాదగిరిగుట్టలో దొమ్మరి మహిళలు పలువురు వేశ్యావృత్తిలో ఉన్నట్లు తెలిసింది. ఆ వృత్తి మాన్పించి వారికి పునరావాసం కల్పించేందుకు జిల్లా కలెక్టరు విజయానంద్‌తో కలిసి 'ఆసరా' అనే ప్రాజెక్టును ప్రారంభించాం. ఇతర ప్రభుత్వాధికారులూ, ప్రజ్వల సంస్థతో కలిసి పనిచేసి 90 శాతం సమస్యను నిర్మూలించాం. ఆ ప్రాజెక్టుకి కూడా అంతర్జాతీయ స్థాయి అవార్డులు వచ్చాయి. అంతకు ముందు ఆదిలాబాద్‌లో చేసిన కమ్యూనిటీ పోలీసింగ్ విధానానికి కూడా అవార్డు వచ్చింది. అప్పుడు రాష్ట్రపతి కలాం నన్ను పిలిపించి మాట్లాడారు. ఆయన అభినందించడం నాకు మంచి జ్ఞాపకం. ఏలూరులో పనిచేసేటప్పుడు అక్కడ పలు గ్రామాల్లోనూ వందల ఏళ్లుగా పాతుకుపోయిన దురాచారాన్ని రూపుమాపడానికి శాయశక్తులా కృషి చేశాను. మన చట్టాల్లో రెడ్ లైట్ ఏరియా అనే దానికి అనుమతి లేదు. అలాంటి వాటిపై చర్యలు తీసుకునే అధికారం ఆర్డీవో స్థాయి అధికారికీ, కమిషనర్‌కీ ఉంటుంది. పెద్దాపురం, రావులపాలెం, తాడేపల్లిగూడెంలలో ఉన్న పలు వేశ్యాగృహాలను మూసేయించాం. అక్కడినుంచి దుబాయ్, సింగపూర్, మలేసియాలకు పంపించిన అమ్మాయిలను కూడా రక్షించాం. ఈ ఉద్యోగం వల్లనే వారిని కాపాడగలుగుతున్నానని

ఆనందంగా ఉంటుంది.

### ఉపాధ్యాయుల కుటుంబం

మాది మహారాష్ట్రలోని అహ్మద్ నగర్ జిల్లా షిర్డీ దగ్గర ఒక చిన్న గ్రామం. నా చదువు అక్కడి ప్రభుత్వ పాఠశాలలో మరాఠీ మాధ్యమంలోనే సాగింది. మా అమ్మానాన్నా ప్రభుత్వ ఉపాధ్యాయులు. అక్క, చెల్లెళ్లిద్దరు, వారి భర్తలూ... మా ఇంట్లో అందరూ ఉపాధ్యాయులే. నేనే టీచింగ్ వైపు వెళ్లలేదు. బాగా చదువుకుని ఆర్థికంగా ఎవరి కాళ్లమీద వాళ్లు నిలబడాలన్నది నాన్న అభిమతం. అమ్మానాన్నలు చదువుకోమని చెప్పేవారే కానీ ఏం చదవాలని ఎప్పుడూ చెప్పలేదు. ఇంజినీరింగ్ పూర్తి చేసేవరకూ నాకు సివిల్ సర్వీసెస్ గురించి ఎలాంటి అవగాహనా ఆలోచనా లేవు. ఇంజినీరింగ్ అయ్యేసరికి ప్రభుత్వ ఉద్యోగాలు లేవు. దాంతో కొంత కాలం ఖాళీగా ఉంటే అప్పుడు నన్నూ టీచరుగా పనిచేయమన్నారు నాన్న. కానీ నా మనసు ఇంకెక్కడో ఉంది. ఏం చేయా లన్నదానిపై స్పష్టత లేకపోయినా చెయ్యా ల్సింది వేరే ఏదో ఉందనిపించేది. కాలేజీలో ఉండగానే వాటర్‌షెడ్ అభివృద్ధి కార్యక్రమాల గురించి ప్రాజెక్టు వర్క్ చేశాను. కొంతమంది ఇంజినీర్లం ఒక బృందంగా ఏర్పడి దీని గురించి అధ్యయనం చేసేవాళ్లం. అన్నాహజారే సొంత గ్రామం రాలెగావ్ సిద్ధి వెళ్లి వాళ్లు అనుసరిస్తున్న విధానాలను పరిశీలించాం. నర్మదా బచావో ఉద్యమకారు లతో కలిసి సర్దార్ సరోవర్ ప్రాజెక్టు కింద ముంపునకు గురవుతున్న ఒక ఆదివాసీ గ్రామానికి తగిన పరిహారం ఇప్పించడానికి మూడు రోజులు నిరాహార దీక్ష చేశాను. మూఢ నమ్మకాలకు వ్యతిరేకంగా పోరాడు తున్న నరేంద్ర దభోల్కర్ తదితరులతో కలిసి గ్రామాల్లో శాస్త్రీయ దృక్పథంపై అవగాహన కల్పించే కార్యక్రమాలు చేపట్టేవాళ్లం. బహుశా ప్రజలతో కలిసి పనిచేయడానికి ఆ వయసు లోనే పునాది పడిందనుకుంటాను.

### ఉన్నతోద్యోగంతోనే సాధ్యమని...

పుణెలో ఉన్న ఓ ఎన్జీవోలో ప్రాజెక్టు ఆఫీసరుగా రెండున్నరేళ్లు పనిచేశాను. ఆ సమయంలో ప్రభుత్వం, ఉన్నతాధికారులు, గ్రామస్థాయిలో పనులు జరిగే తీరు... వీటన్నిటి గురించి అవగాహన ఏర్పడింది. ప్రభుత్వంలో ఉన్నత స్థాయి ఉద్యోగంలో ఉంటే చాలామంది సిబ్బంది ఉంటారు, నిధులు అందుబాటులో ఉంటాయి. ప్రజల కోసం బాగా పనిచేయవచ్చు. ఆ ఆలోచన సివిల్ సర్వీసెస్‌లో చేరాలన్న ఆకాంక్షకు ప్రేరణ అయింది. అక్కడ పనిచేస్తూనే చదవ డమూ మొదలెట్టాను. రెండో యత్నంలో 1995లో ఐపీఎస్ వచ్చింది. ఐఏఎస్ కావాలని మరోసారి ప్రయత్నించాను కానీ రాకపోవ డంతో 1996లో ఐపీఎస్‌లో చేరాను. శిక్షణ అయ్యాక మణిపూర్ కేడర్‌లో చేరి ఇంఫాల్ వెళ్లాను. అక్కడ పనిచేస్తుండగా 1999లో పెళ్లైంది. నా భార్య సునీత అప్పుడు ఏపీ కేడర్ ఫారెస్ట్ సర్వీస్‌లో ఉంది. అందుకని నేను కూడా ఇక్కడికి బదిలీ చేయించు కున్నాను. మణిపూర్‌లో ఉండగానే మణిపురీ నేర్చుకున్నా. ఇక్కడికి వచ్చాక తెలుగు కూడా నేర్చేసుకున్నాను.

రెండేళ్ల క్రితమే ఉస్మానియా యూనివర్శిటీ నుంచి న్యాయశాస్త్రంలో పట్టా పొందాను. మా ఉద్యోగానికి చట్టాల గురించి తెలిసి ఉండడం అవసరం, అందుకే లా చదివాను. విమెన్ ప్రొటెక్షన్ సెల్ బాధ్యతలు నిర్వహించే టప్పుడు మరోసారి అక్రమ రవాణా సమస్యపై కృషిచేసే అవకాశం వచ్చింది. కేంద్ర హోంమంత్రిత్వ శాఖ, ఐరాసలో డ్రగ్స్, ట్రాఫికింగ్ సమస్యలపై పనిచేస్తున్న విభాగం... వీరంతా కలిసి ఒక ప్రాజెక్టు ప్రారంభించారు. దానికి నేను బాధ్యుణ్ని. ఆ ప్రాజెక్టు కింద రాష్ట్రం నుంచి మహిళలను వివిధ నగరాలకు తరలించిన కేసులన్నీ పరిశోధించాం. నా ఆధ్వర్యంలో బృందాలుగా ఆయా నగరాలకు వెళ్లి వేశ్యాగృహాల మీద దాడులు జరిపి వందలాది యువతుల్ని విడిపించాం. అప్పుడే ట్రాఫికింగ్ సమస్య మీద కొన్ని పుస్తకాలు కూడా రాశాను.

### మరికొన్ని...

**మాది** పెద్దలు కుదిర్చిన పెళ్లే. సునీత మరాఠీ అమ్మాయే.

★ మాకు సాంస్కృతిక కార్యక్రమాలంటే ఇష్టం. తీరిక ఉంటే రవీంద్రభారతికి వెళ్తా.

★ ఆదివారం పూర్తిగా కుటుంబసభ్యులతో గడుపుతాను.

★ హిందీ, మరాఠీ సినిమాలు చూస్తాం. తెలుగు సినిమాలు చూడలేదు.

★ మాకిద్దరు అమ్మాయిలు. పెద్దమ్మాయి ఇంటర్ అయిపోయింది. చిన్నమ్మాయి 9వ తరగతిలో ఉంది.

### ప్రజాదర్బారుతో ప్రజలకు చేరువగా..

2016 నుంచి రాచకొండ కమిషనర్‌గా ఉన్నాను. ఈ ఏడాదిలో వందలాది బాలకార్మి కులను రక్షించాం. యాభై వేశ్యాగృహాలను మూసేయించాం. వాటిల్లో కొన్ని లాడ్జిలు కూడా ఉన్నాయి. ఈ తరహా నేరాలకు పాల్పడుతున్న 150 మందిని అరెస్టు చేశాం. ఆన్‌లైన్ సెక్స్ రాకెట్స్‌ని ఛేదించాం. కొంత కాలంగా ప్రజాదర్బార్ కార్యక్రమం నిర్వహి స్తున్నాం. వారంలో ఒక్కో రోజు ఒక్కో ప్రాంతంలో ఇది నిర్వహిస్తున్నాం. దీనికి మంచి స్పందన వస్తోంది. ఆ మధ్య ఒక వృద్ధుడు తన స్థలాన్ని మరెవరో ఆక్రమించు కున్నారని ఫిర్యాదు చేశాడు. ఇన్వెస్టిగేట్ చేయిస్తే అలాంటివి చాలా కేసులు బయటకు వచ్చాయి. నిందితులను అరెస్టు చేయడంతో అలా తప్పుడు రిజిస్ట్రేషన్లు చేయించుకున్న పలువురు భయపడి తమంతట తామే రిజిస్ట్రే షన్లను క్యాన్సిల్ చేయించుకున్నట్లు తెలిసింది. కమిషనరేట్ ఆధ్వర్యంలో నిరుద్యోగ యువ తకు పోలీసు కానిస్టేబుల్ ఉద్యోగానికి శిక్షణ కూడా ఇస్తున్నాం. మొత్తం 1250 మంది మూణ్నెళ్ల శిక్షణ పొందుతున్నారు. ఈ మధ్యే 'షి ఫర్ హర్' అనే పేరుతో మరో కార్యక్రమం మొదలుపెట్టాం. ఒక్కో కళాశాల నుంచీ కొందరు అమ్మాయిల్ని ఎంపిక చేసి వివిధ విభాగాలకు చెందిన నిపుణులతో శిక్షణ ఇప్పించాం. వారంతా ఆయా కళాశాలల్లో



తోటి అమ్మాయిలకు ఏవైనా సమస్యలు ఎదు రైనప్పుడు అండగా నిలబడతారు. అవసర మైతే షి టీమ్‌ల సహాయం తీసుకుంటారు. ఒకరకంగా వీరు షి టీమ్‌లకూ, బాధితులకూ మధ్య వారధిగా పనిచేస్తారన్న మాట. దీనికి కూడా మంచి స్పందన వస్తోంది.

### 84 మంది విజయం సాధించారు

సివిల్ సర్వీసెస్ పరీక్షలు రాసేవారికి మార్గ దర్శకత్వం వహిస్తున్నాను. ఇటీవల విడుదలైన ఫలితాల్లో నా దగ్గర శిక్షణ పొందిన 84 మంది విజయం సాధించారు. ఇంటర్వ్యూ దశకు వచ్చినవారికి నేను సలహాలూ, సూచనలూ ఇచ్చేవాణ్ని. ఇకముందు రాత పరీక్ష దశనుంచీ శిక్షణ ఇద్దామనుకుంటున్నాను. నాకు లభించే కొద్దిపాటి ఖాళీ సమయాన్ని దీనికోసమే విని యోగిస్తున్నా. ఈ పరీక్షలకు వెళ్లదలచుకున్న వారికి నేను చెప్పేది ఒకటే... ప్రభుత్వ సర్వీసు అంటే అధికారం, డబ్బూ ఉంటాయని చేరవద్దు. ప్రజల పట్ల బాధ్యత వహించడానికీ, సమాజానికి సేవ చేయడానికీ చేరాలి. ★

# ఇవి...'అరటి' జీన్స్..!









చిన్నాపెద్దా ఆడామగా తేడా లేకుండా... ఈ రోజుల్లో ఎవరి వార్డ్‌రోబ్ చూసినా కనీసం ఓ జత అయినా జీన్స్ ప్యాంటులో షర్టులో టాపులో స్కర్టులో కనిపించకుండా ఉండవు. జీన్స్ క్లాత్ అనేది మన ఆహార్యంలో అంతలా భాగమై పోయింది. అందుకే ఇటీవల దాన్ని పర్యావరణ ప్రియంగా అరటిపీచుతోనూ రూపొందించే ప్రయత్నాలు చేస్తున్నారు. ఆ సంగతేంటో తెలుసుకోవాలంటే చెన్నై సమీపంలోని అనకాపుత్తూరు గ్రామానికి వెళ్లాల్సిందే.





పెద్ద మొక్క పక్కనే పిలకొస్తుంది. ఆ పిలక ఏపుగా పెరిగి మొక్కవుతుంది. ఓ గెల వేస్తుంది. అది పక్వానికి రాగానే ఆ మొక్కను కొట్టేసి చెత్తలో పారేస్తారు. అరటితోటలు పెంచేవాళ్లందరికీ ఇది అనుభవమే. కానీ అంతా వృథాగా పారేసే ఆ మొక్క నుంచి తీసిన పీచుతో తన బృందం సాయంతో జీన్స్ క్లాత్‌నీ రూపొందించారు చెన్నైకి సమీపంలోని అనకాపుత్తూరు గ్రామానికి చెందిన సి.శేఖర్.

జ్యూట్ వీవర్స్ అసోసియేషన్‌కు అధ్యక్షుడుగా ఉన్న శేఖర్, అరటిపీచుకి పత్తి దారాలను జోడించి రూపొందించిన ఈ డెనిమ్ ఫ్యాబ్రిక్, సాధారణ జీన్స్‌కన్నా ఎక్కువగా నీటిని పీల్చుకుంటుందనీ, అందుకే వేసవిలో ఒంటికి హాయిగా ఉంటుందనీ, ప్రస్తుతం జీన్స్ ప్యాంటులతోబాటు స్కర్టుల్ని కూడా ఈ బట్టతోనే తయారుచేస్తున్నామనీ చెప్పుకొస్తున్నారు. ఈ జీన్స్ క్లాత్‌కు వాడిన రంగులు కూడా సహజమైనవే. ప్యాంటులూ, స్కర్టుల తయారీలో వాడే గుండీలు, హుక్స్, జిప్పులు సైతం కొబ్బరి పెంకులతో చేసినవే కావడం విశేషం. పైగా అరటిపీచుతో చేసిన దారాలు త్వరగా కుంచించుకుపోకుండానూ రంగు వెలిసిపోకుండానూ ఉంటాయి. గంజిలేకపోయినా ఈ బట్ట నిలబడే ఉంటుంది. ఆసుపత్రులు, రిసెర్చ్ సెంటర్లలో వెలువడే అణుధార్మిక, అతినీలలోహిత కిరణాల నుంచి కూడా ఈ బట్ట ఒంటిని రక్షిస్తుంది. నిరంతరం కంప్యూటర్లు, సెల్‌ఫోన్లతో ఎక్కువగా పనిచేసే వాళ్లు ఈ దుస్తుల్ని ధరించడంవల్ల ఆయా వస్తువుల నుంచి వెలువడే వేడి శరీరాన్ని చేరకుండా అడ్డుకుంటుంది. శరీర ఉష్ణోగ్రతను కూడా తగ్గించి చల్లగా ఉంచేందుకు దోహదపడతాయనీ వివరిస్తున్నారు శేఖర్.

## ఎక్కడెక్కడ?

పత్తి, పట్టు దారాల మాదిరిగానే అరటి మొక్కల పీచుని కూడా నాణ్యమైన దారాలుగా మలచవచ్చు. నాణ్యమైన సహజదారాల్లో అరటి ఒకటి. ఈ దారాలు దృఢమైనవి కూడా. కానీ చాలాచోట్ల వృథాగా పారేస్తుంటే, కొన్నిచోట్ల మాత్రం దాన్నుంచి తీసిన పీచుతో రకరకాల ఉత్పత్తులూ ఫర్నిచరూ తయారుచేస్తున్నారు. జపాన్‌లో అయితే టీ బ్యాగుల నుంచి కరెన్సీ నోట్లు, కారు టైర్ల వరకూ ఈ పీచుతో చేస్తుంటారు. ప్రస్తుతం ఉన్న కరెన్సీ నోట్లతో పోలిస్తే ఈ దారాలతో చేసిన నోట్ల మన్నిక ఎక్కువ. మనదగ్గర అయితే నిన్నమొన్నటివరకూ అరటి పీచుతో బ్యాగులూ చెప్పులూ మాత్రమే తయారుచేసేవారు. కానీ ఇప్పుడిప్పుడే దుస్తులూ ఇతర యాక్సెసరీలనూ రూపొందిస్తున్నారు.

అవన్నీ దాటి మరో అడుగు ముందుకేసిన శేఖర్ బృందం జీన్స్‌కీ రూపకల్పన చేసింది. గతంలో ఈ బృందమే అరటి, వెదురు వంటి మొక్కల నుంచి తీసిన 25 రకాల పీచులతో చీరను నేసి లిమ్కా బుక్ ఆఫ్ రికార్డుల్లోకీ ఎక్కింది. ఆయన యూనిట్‌లో రూపొందించిన జీన్స్‌ను అండమాన్ నికోబార్ దీవులకు చెందిన అధికార బృందం పరిశీలించి, ఆ పీచును ఎలా తయారుచేయాలనే దానిమీద తమ దీవుల్లోని చేనేత కార్మికులకూ శిక్షణ ఇప్పించింది.

## ఎలా చేస్తారు?

అరటికాండం లోపల ఉండే మృదువైన పీచు నుంచే ఈ దారాలను రూపొందిస్తారు. అరటి పీచూ వెదురులానే ఉంటుంది. కానీ అల్లిక విషయానికొస్తే వెదురు కన్నా మృదువుగా ఉండి ఎలా కావాలంటే అలా వంగుతుంది. నిజానికి అరటిపీచుతో దుస్తుల్ని రూపొందించడం అనేది ఈనాటిది కాదు. రామాయణ, మహాభారతాల్లో నార దుస్తుల గురించి వినే ఉంటారు. అంటే ఆ కాలం నుంచీ ఇవి ఉన్నాయన్నమాట. చారిత్రక ఆధారాల ప్రకారం మాత్రం 13వ శతాబ్దం నుంచీ అరటిపీచుతో దుస్తుల్ని రూపొందించడం వాడుకలో ఉంది. ఆపై పత్తి, పట్టు దారాలు ప్రాచుర్యం పొందడంతో అవి క్రమేణా తెరమరుగైపోయాయి. కానీ జపాన్, నేపాల్ దేశాల్లో మాత్రం ఇప్పటికీ సంపన్న వర్గాలు తమ సంప్రదాయ వేడుకలకోసం అరటిపీచుతో నేసిన వాటినే ధరిస్తుంటారు. నిజానికి మొదట్లో వాళ్లూ ఆ కాండాల్ని వృథాగా పారేసేవారట. తరవాత్తరవాత దీన్ని రకరకాలుగా వాడటం ప్రారంభించారు. ప్రస్తుతం ప్రపంచవ్యాప్తంగా అరటిపీచు వాడకం పెరుగుతోంది. కాబట్టి ముందుముందు 'జీన్స్ కావాలి...' అని షాపుకెళితే 'ఏ జీన్స్... కాటన్ జీన్సా... బనానా జీన్సా...?' అని అడిగేరోజు మరెంతో దూరంలో లేదన్నమాట.





# టెక్... అదిరింది గురూ..!

కారు... యజమానిని గుర్తిస్తుంది, అద్దం... అందాన్ని వర్ణిస్తుంది, కంప్యూటర్ తెర... అద్భుతాన్ని కళ్లకు కడుతుంది, బుల్లి రోబో... ఇంటికి కాపలా కాస్తుంది. 2017 సీయీఎస్ షోతో తెరమీదికొచ్చిన ఈ ఉత్పత్తులు ప్రస్తుతం ఎంతోమంది టెక్ ప్రియుల మనసును దోచుకుంటున్నాయి.

## అందాన్ని వర్ణించే అద్దం



మన ముఖం జిడ్డుకారుతోందా బాగుందా అన్నది అద్దంలో చూసుకుంటేనే తెలుస్తుంది. అయితే, చర్మం రంగు మారుతున్నా ముఖం గరుకుగా అవుతున్నా కళ్లకింద వల యాలు ఏర్పడుతున్నా సమస్య బాగా ఎక్కువైతే తప్ప మనం గుర్తించలేం. అప్పటికి బోలెడంత నష్టం జరిగిపోతుంది. కానీ ఈ 'హాయ్ మిర్రర్ ప్లస్' అద్దంలో చూసుకున్న ప్రతిసారీ ముఖంలో ఎక్కడ ఏయే సమస్యలున్నాయో చెప్పేస్తుంది. ఆప్‌తో పనిచేసే ఈ హైటెక్ అద్దం బ్లాక్ హెడ్స్, వైట్ హెడ్స్, ముఖం మీద ముడుతల్లాంటి సమస్యల గురించే కాదు, ఏదైనా క్రీమ్ మార్చినపుడూ ఇతర సౌందర్య లేప నాలు వాడుతున్నపుడూ అవి ఎంతవరకూ పనిచేశాయన్న విషయాన్ని కూడా తెలియజేస్తుంది. దీన్ని మ్యూజిక్ ప్లేయర్, వీడియో ప్లేయర్‌లా కూడా ఉపయోగించుకోవచ్చు.

## వాచ్‌మన్ రోబో

ఇంటికి తాళం వేసి బయటకొచ్చా మంటే మళ్లీ ఇంటికెళ్లేవరకూ భయమే. ఓ వారం ఊరెళ్తే ఆ భయం ఇంకా పెరుగు తుంది. ఆ సమస్య లేకుండా మనింటికి కాపలా కాసేందుకు రూపొందించిందే ఈ 'హే కురి' రోబోట్. ఆప్‌తో పనిచేసే ఇది మనం లేనపుడు చక్రాల సాయంతో ఇల్లంతా తిరుగుతూ ఫొటోలూ వీడియోలూ తీస్తుంది. ఏదైనా అనుమానాస్పద శబ్దం వినిపించినా కొత్త మనుషులు ఇంట్లో ప్రవేశించినా వెంటనే మన ఫోన్‌కి అలారం మెసేజ్‌ని పంపిస్తుంది. ఇక, మనం ఇంట్లో ఉన్నపుడు కావాలంటే ఉదయాన్నే సమయానికి నిద్రలేపుతుంది కూడా. ఆ సమయంలో దగ్గరకొచ్చి చిన్నగా శబ్దం చేస్తుంది. కురితో సంగీతాన్ని కూడా వినొచ్చు. మనం దగ్గరగా ఉన్నపుడు దాన్లో నిక్షిప్తం చేసిన మ్యూజిక్‌ని ఆన్ చెయ్యమనీ పిల్లల గదికి వెళ్లి కథలు వినిపించమనీ పెంపుడు కుక్క ఎక్కడుందో చూడమనీ... ఇలా అన్నిటినీ నోటితో చెప్పినా చేసేస్తుంది. అంతేకాదు, ఛార్జింగ్ అయిపోయినపుడు ఇది నేలమీద ప్లేటులా ఉండే ఛార్జింగ్ డాక్‌మీదికెళ్లి రీఛార్జ్ అయిపోతుంది. కాబట్టి, ఊరెళ్లినపుడూ ఇబ్బంది ఉండదు. కురి పిల్లల వెనుకే తిరుగుతూ వారిని ఆడిస్తుంది కూడా. సుమారు రూ.45000 ధర ఉన్న ఈ రోబోట్‌ని 'హే కురి' వెబ్‌సైట్‌లో ఆర్డరిచ్చి తెప్పించుకోవచ్చు.

## ఇలాంటి కారును చూసుండరు!

ఫెరాడే ఎఫ్ ఎఫ్ 91... రీఛార్జబుల్ బ్యాటరీతో పనిచేసే ఈ ఎలక్ట్రిక్ కారు యజమాని, ఇతర ప్రయాణికులు కారు ఎదురుగా రాగానే కెమేరాలూ సెన్సర్ల ద్వారా వారిని గుర్తించి వారి అలవాట్లకు తగ్గట్లు లోపల ఎంత ఏసీ ఉండాలీ, సీట్లు ఎంత వాలుగా ఉండాలి... లాంటి సెట్టింగుల్ని సరిచేస్తుంది. అంతేకాదు, యజ మాని కారులో నుంచి దిగాక దానంతట అదే పార్కింగ్ స్థలాన్ని చూసుకుని కారుని పార్క్ చేసుకుంటుంది. అదంతా ఆప్ ద్వారా ఫోన్‌లో చూసుకోవచ్చు. ఈ కారుకి తాళాలు కూడా ఉండవు. ముందే నిక్షిప్తం చేసుకున్న సమాచారం మేరకు టచ్ బటన్‌ని నొక్కగానే డోర్ తెరుచుకుంటుంది. గంటకు 55 మైళ్ల వేగంతో నడిచే ఫెరాడే కేవలం 2.39 సెకె న్లలో 60 కిలోమీటర్ల వేగాన్ని అందుకుం టుంది. అందుకే, ప్రపంచంలోనే వేగంగా నడిచే ఎలక్ట్రిక్ కారు ఇదేనట. దీన్లో వైఫైతో పాటు హెచ్‌డీ స్క్రీన్‌లు కూడా ఉంటాయి. వచ్చే ఏడాది ఇది మార్కెట్లోకి వస్తుందట. కావాలంటే కంపెనీ సైట్‌లోకి వెళ్లి ముందుగా ఆర్డరివ్వొచ్చు.





## హెచ్‌డీ అల్ట్రా హెచ్‌డీ... అన్నీ బలాదూర్

టీవీలో హెచ్‌డీ ఛానెల్ వస్తుంటేనే మామూలు స్క్రీన్‌కీ దానికీ స్పష్టమైన తేడా కనిపిస్తుంది. హెచ్‌డీ తదుపరి వెర్షన్ 4కే. దీన్లో గాల్లోకి ఎగిసిన దుమ్ము రేణువులు కూడా ప్రేక్షకుడి కంటికి స్పష్టంగా కనిపిస్తాయి. బాహుబలి సినిమాను పెద్ద స్క్రీన్ మీద చూసినవారికి ఆ స్పష్టత గురించి తెలిసే ఉంటుంది. ఇక, దానికి రెట్టింపు... అంటే 8కే వెర్ష న్‌లో ఫొటోల్నీ వీడియోల్నీ చూస్తే ఎలా ఉంటుందో ఊహించుకోండి... అలాంటి అద్భుతమే డెల్ కంపెనీ కొన్ని రోజుల కిందట మార్కెట్లోకి తీసుకొచ్చిన 32 అంగుళాల 'అల్ట్రా షార్ప్ 8కే మానిటర్'. వంద కోట్ల రంగులున్నా వాటిలో తేడాలను స్పష్టంగా చూపించగలదట ఇది. దీన్లో ఏదైనా సీనరీ ఫొటోని చూస్తే నేరుగా అక్కడుండి చూసినంత బాగా కనిపిస్తుందన్నమాట.

# బాల వినోదిని

## పోలికలేంటి?

ఇక్కడ తొమ్మిది బొమ్మలు ఉన్నాయి కదా. అడ్డం, నిలువు, ఐమూలలగా వాటి మధ్య ఉన్న పోలికలను చెప్పండి.



## గబగబా

ఈ పదాలను గబగబా అనండి చూద్దాం.

★ HIGHER ROLLER, LOWER ROLLER

★ PROPER COFFEE, COPPER COFFEE

★ GREEN GLOBES GLOW GREEN

## ప్రతిబింబం



ఇక్కడున్న నాలుగు బొమ్మల్లో పై బొమ్మకు ప్రతిబింబం ఏది?




## గప్‌చుప్

1. ఇక్కడ ఇద్దరు పిల్లలు బొమ్మలు గీస్తున్నారు కదా. అయితే కాగితం వెనక వైపు కూడా కొన్ని బొమ్మలు గీశారు. అవి ఏ బొమ్మలో చెప్పండి.

2. మూడు రంగుల కాగితాలు మడతలు పెట్టి ఉన్నాయి కదా. ఏ రంగు కాగితం మిగతా వాటికంటే పెద్దది?

3. ఇక్కడున్న మూడు కాగితాల్లో తాళ్లలో చిక్కుకోని కాగితం ఏది?

4. ఈ అమ్మాయి పట్టుకున్న కాగితంలోని బొమ్మ లాంటిదే మరొకటి ఉంది. ఎక్కడుందో కనుక్కోండి.

5. ఇక్కడున్న అక్షరాలలో ఒక ఆంగ్ల పదం దాగి ఉంది. అదేమిటో చెప్పండి.



## ఇది... బాతుల క్యాట్‌వాక్!





బాతుల్ని ఎన్నోసార్లు చూసుంటారు. కానీ ఇలాంటి బాతుల్ని మాత్రం ఎప్పుడూ, ఎక్కడా చూసుండరు. ఎందుకంటే... ఇవి చక్కగా రంగురంగుల గౌనులు వేసుకుని, టోపీలు పెట్టుకుని క్యాట్‌వాక్ చేస్తుంటాయి. వినడానికి కాస్త ఆశ్చర్యంగానే ఉన్నా ఇది నిజం. బ్రియాన్ హ్యారింగ్‌టన్ ఇలా బాతులకు శిక్షణ ఇస్తుంటాడు. అతడు ముప్ఫై ఏళ్ల నుంచీ బాతులకు శిక్షణ ఇచ్చి ప్రదర్శిస్తున్నాడు. ఆస్ట్రేలియాలోని సిడ్నీలో ఈస్టర్ పండగ సందర్భంగా నిర్వహించే వేడుకల్లో భాగంగా బాతుల ప్రదర్శన ఏర్పాటుచేస్తారు. ఆ సందర్భంలోనే కాకుండా అప్పుడప్పుడూ హోటళ్లలోనూ, బీచ్‌లలోను కూడా బాతుల క్యాట్‌వాక్‌ను నిర్వహిస్తాడు బ్రియాన్. సందర్శకులు దీన్ని బాగా ఆదరించడమే కాకుండా వీటితో ఫొటోలు కూడా తీయించుకుంటారట.

## అన్నదమ్ములు

ఒక ఊరిలో రామయ్య, కృష్ణయ్య అనే అన్నదమ్ములు ఉండే వాళ్లు. చిన్నతనం నుంచీ వాళ్లిద్దరూ ఎంతో సఖ్యంగా ఉండేవాళ్లు. పెద్దయ్యాక గొడవలై ఇద్దరూ విడిపోయి వేర్వేరుగా ఇళ్లు కట్టుకున్నారు. ఇద్దరి ఇళ్లూ కాస్త దూరంలో ఎదురెదురుగా ఉండేవి. కొన్నాళ్ల తర్వాత తమ్ముడు కృష్ణయ్య తన ఇంటి ముందు కాలువ తవ్వించాడు. తను వాళ్ల ఇంటికి వెళ్లకుండా ఉండాలనే కృష్ణయ్య అలా కాలువ తవ్వించి ఉంటాడని అపోహపడ్డాడు రామయ్య. ఒక రోజు పక్క ఊరి నుంచి ఒక వ్యక్తి వచ్చి ఏదైనా పని ఉంటే ఇప్పించమని రామయ్యను అడిగాడు. రామయ్య ఎదురుగా ఉన్న తన తమ్ముడి ఇంటిని చూపించి 'ఆ ఇల్లు నా కంటికి కనిపించకూడదు. నా ఇంటి చుట్టూ ఎత్తైన దడి కట్టు' అని చెప్పి పని మీద బయటకు వెళ్లిపోయాడు.



రామయ్య సాయంత్రం ఇంటికి వచ్చే సరికి ఇంటి చుట్టూ దడికి బదులుగా కాలువ మీద చెక్కల వంతెన కనిపించింది. దాన్ని చూసి... 'తమ్ముడికి నన్ను చూడాలని ఉంది కాబోలు, అందుకే ఈ వంతెన కట్టించాడు' అనుకున్నాడు రామయ్య. 'అన్నయ్యకు నా మీద కోపం తగ్గినట్టుంది. ఇటువైపు రావడానికి వంతెన కట్టించాడు' అనుకున్నాడు తమ్ముడు కృష్ణయ్య. అలా అన్నదమ్ములిద్దరూ ఒకరికోసం ఒకరు కట్టించారని ఊహించుకుని ఇద్దరూ బయలుదేరి ఒకరికొకరు వంతెన మీద ఎదురుపడ్డారు. ఆప్యాయంగా కౌగిలించుకుని కుశల ప్రశ్నలు వేసుకున్నారు. అప్పుడు వడ్రంగి వాళ్ల దగ్గరకు వచ్చి 'అయ్యా మీరు నన్ను క్షమించాలి. మీరు చెప్పినట్టుగా ఇంటి చుట్టూ దడి కడితే మీ మధ్య విభేదాలు ఇంకా పెరుగుతాయని భయపడ్డాను. ఎందుకంటే మీ ఇద్దరి సఖ్యత గురించి ఒకప్పుడు మీ ఊళ్లోనే కాకుండా పక్క ఊళ్లోనూ అందరూ ఎంతో గొప్పగా చెప్పుకునేవాళ్లు. అలాంటి మీరు విడిపోకూడదనీ, ఎప్పటిలా కలిసే ఉండాలనీ ఇలా చేశాను. నేను తప్పు చేశాననుకుంటే క్షమించండి' అని వేడుకున్నాడు. 'ఇందులో నువ్వు చేసిన తప్పేమీ లేదు. అపార్థాలతో విడిపోయిన మమ్మల్ని కలిపి మంచి పనిచేశావు' అని అన్నదమ్ములిద్దరూ అతడికి మంచి బహుమానాలు ఇచ్చి పంపారు.

## గుర్తించండి

ఈ చిత్రంలో 'K' అక్షరంతో మొదలయ్యే పది పదాలను గుర్తించండి.



## విప్పండిచూద్దాం

1. నేల మీద పాకని తీగ?
2. ఎందరు కూర్చున్నా విరగని బండి?
3. పొడవుగా పండే పంటను పొడిగా వాడతాం?
4. వెలుతురులో నీతోనే ఉంటుంది. చీకటిలో తప్పించుకుపోతుంది?

## రంగులేద్దాం






### జవాబులు

గప్‌చుప్: 1. నక్షత్రం, పువ్వులు 2. పసుపురంగు 3. మధ్యలోది 4. కూర్చున్న అబ్బాయి వెనుక ఉంది 5. MADAM.

పోలికలేంటి?: అడ్డం: ఇంటి మీద ఇటుకల డిజైన్, ఇంటి పై భాగంలో గీతలు, చెట్టు; నిలువు: వెంటిలేటర్, రెండు కిటికీలు, ఇంటిముందు గడ్డి; ఐమూల: ఇంటి మీద డిష్ యాంటెనా, ఇంటి గుమ్మం మీద సన్‌షేడ్‌లు.

ప్రతిబింబం: 4

గుర్తించండి: Keys, Kitten, Kettle, kiwifruit, Knife, Kite, Kangaroo, Kingfisher, Knot, Koala.

విప్పండిచూద్దాం: 1. కరెంటు తీగ 2. రైలుబండి 3. పంచదార 4. నీడ.

# అన్నం... కొత్తగా చేద్దాం

**స్కూళ్లూ కాలేజీలూ తెరిచేశారు. పిల్లలంతా చదువులతో బిజీ. అమ్మలేమో బాక్సులు నింపడంలో బిజీ. అందులోనూ రోజుకోరకం వండి పెట్టాలి. ఎందుకంటే అన్నం కూరలు వేటికవి విడిగా పెడితే సరిగ్గా తినరు. అందుకే రకరకాల రైస్ వెరైటీస్ చేసి పెడితే ఇష్టంగా తింటారు. మరి చేసేద్దామా..!**




### కావలసినవి

వండిన అన్నం: 6 కప్పులు, వెల్లుల్లి రెబ్బలు: 20, ఉల్లికాడల ముక్కలు: కప్పు, అల్లం రసం: 2 టేబుల్‌స్పూన్లు, కారం: టీస్పూను, చిలగడదుంపలు: నాలుగు, నూనె: 2 టేబుల్‌స్పూన్లు, ఉప్పు: రుచికి సరిపడా

### తయారుచేసే విధానం

★ బాణలిలో నూనె వేసి కాగాక వెల్లుల్లి ముక్కలు వేసి రంగు మారేవరకూ వేయించాలి. తరవాత చిలగడదుంప ముక్కలు, ఉప్పు వేసి ఉడికించాలి. ముక్కలు సగం ఉడికిన తరవాత కారం, అల్లం రసం వేసి పూర్తిగా ఉడకనివ్వాలి. తరవాత ఉల్లికాడల ముక్కలు వేసి బాగా కలపాలి. చివరగా ఉడికించిన అన్నం వేసి బాగా కలిపి దించాలి.

## స్పైసీ రైస్

### కావలసినవి

బాస్మతి బియ్యం: 2 కప్పులు, ఉల్లిపాయలు: రెండు, నూనె: 2 టేబుల్‌స్పూన్లు, పసుపు: అర టీస్పూను, దాల్చినచెక్క: ఒకటి, యాలకులు: ఆరు, జీలకర్ర: టీస్పూను, జీడిపప్పు: అరకప్పు, ఎండుద్రాక్ష: పావు కప్పు

### తయారుచేసే విధానం

★ విడిగా పాన్ తీసుకుని అందులో సరిపడా నీళ్లు పోసి మరిగాక ఉప్పు వేయాలి. బాగా బుడగలు వచ్చేవరకూ మరిగించాక పసుపు, దాల్చినచెక్క వేయాలి. ఇప్పుడు బియ్యం వేసి ఉడికించాలి. అన్నం బాగా ఉడికిన తరవాత గంజి వంపేయాలి.

★ చిన్న పాన్‌లో కొద్దిగా నెయ్యి వేసి జీడిపప్పు, ఎండుద్రాక్ష వేసి వేయించి తీయాలి.

★ ఉల్లిపాయలు సన్నగా పొడవుగా తరగాలి. బాణలిలో నూనె వేసి ఉల్లిముక్కలు వేసి బాగా వేయించాలి. దంచిన యాలకులు, జీలకర్ర కూడా వేసి వేగాక వేయించిన జీడిపప్పు, ఎండుద్రాక్ష వేసి కలపాలి. చివరగా ఉడికించి వార్చిన అన్నం వేసి బాగా కలిపి దించాలి.

**రుచి అభిరుచి**

## కాబూలీ రైస్

### కావలసినవి

బియ్యం: పావుకిలో, యాలకులు: నాలుగు, దాల్చినచెక్క (అంగుళం ముక్కలు): రెండు, నూనె: 2 టేబుల్‌స్పూన్లు, సెనగలు: 200గ్రా., పెరుగు: పావులీటరు, ఉప్పు: తగినంత, నల్లయాలకులు: రెండు, షాజీరా: టీస్పూను, అల్లంవెల్లుల్లి: టీస్పూను, పచ్చిమిర్చి: రెండు, పుదీనా ఆకులు: పది, పసుపు: టీస్పూను, కారం: టీస్పూను, నెయ్యి: 2 టీస్పూన్లు

### తయారుచేసే విధానం

★ బియ్యం అరగంట నాననివ్వాలి. సెనగలు రెండుమూడు గంటలు నానబెట్టాలి.

★ బాణలిలో కాసిని నీళ్లు పోసి ఆకుపచ్చ యాలకులు, దాల్చినచెక్క ముక్కలు, లవంగాలు, నూనె, ఉప్పు వేసి మరిగించాలి. తరవాత నానబెట్టిన బియ్యం వేసి కలపాలి.



★ ఓ గిన్నెలో నానబెట్టిన సెనగలు, అల్లంవెల్లుల్లి, పచ్చిమిర్చి, పుదీనా ఆకులు, పసుపు, కారం, అన్నీ వేసి బాగా కలపాలి. ఇప్పుడు మరో పాన్ తీసుకుని అందులో బియ్యం మిశ్రమాన్నీ దానిమీద సెనగల మిశ్రమాన్నీ పొరలు పొరలుగా వేసి ఆపైన నెయ్యి వేసి మూతపెట్టి ఉడికించి దించాలి.

**మరిన్ని వంటల కోసం www.eenadu.net లోని రుచులు పేజీ చూడండి.**




### కావలసినవి

బాస్మతి బియ్యం: 2 కప్పులు నీళ్లు: 8 కప్పులు, ఉప్పు: తగినంత, నూనె: టీస్పూను, క్యాప్సికమ్, క్యారెట్, బీన్స్, క్యాబేజీ, పుట్టగొడుగుల ముక్కలు: పావుకప్పు చొప్పున, వెల్లుల్లి: 8, కొత్తిమీర తురుము: 4 టీస్పూన్లు, సోయాసాస్: 2 టేబుల్‌స్పూన్లు, వినెగర్: 2 టీస్పూన్లు, అనాసపువ్వు: ఒకటి, నూనె: 5 టేబుల్‌స్పూన్లు, ఉల్లికాడలు: 4 టేబుల్‌స్పూన్లు, ఉప్పు: తగినంత

### తయారుచేసే విధానం

★ బియ్యం బాగా కడిగి ఓ అర గంటసేపు నాననిచ్చి వంపేసి పక్కన ఉంచాలి.

★ విడిగా ఓ గిన్నెలో నీళ్లు పోసి ఉప్పు, నూనె వేసి మరిగించాలి. కడిగి ఉంచిన బియ్యం వేసి సిమ్‌లో మూతపెట్టకుండా ఉడికించాలి. రైస్ పలుకు వీడి కాస్త ఉడకగానే స్టవ్ ఆఫ్ చేసి వెనకటి పద్ధతిలో గంజి వార్చినట్లుగా వార్చాలి. తరవాత అన్నంలో కొద్దిగా చల్లని నీళ్లుపోసి మరో సారి గంజిని వంపేసి మూతపెట్టి అన్నం పూర్తిగా చల్లారనివ్వాలి.

★ ఇప్పుడు కూరగాయలన్నీ సన్నగా తరగాలి. బాణలిలో నూనె వేసి అనాసపువ్వు వేసి వేగాక వెల్లుల్లి ముక్కలు, అల్లం తురుము వేసి వేగనివ్వాలి. ఇప్పుడు ఉల్లికాడలు కూడా వేసి రెండు నిమిషాలు వేయించాక కూరగాయల ముక్కలన్నీ వేసి వేయించాలి. అవి పూర్తిగా ఉడికి వేగాక సోయాసాస్, ఉప్పు, వినెగర్ వేసి కలపాలి. తరవాత చల్లార్చిన అన్నం వేసి బాగా కలిపి కొత్తిమీర చల్లి దించితే చైనీస్ వెజ్ ఫ్రైడ్ రైస్ రెడీ.



# దివ్యాంగులకు పెళ్లి పెద్దలు... ఈ 'ఆప్'లు!

పెళ్లి సంబంధాలు కుదుర్చుకోవడానికి ఈరోజుల్లో అంతర్జాలమే ఆధారమవుతోంది. సమయం, దూరాభారాలను దృష్టిలో పెట్టుకుని ఆన్‌లైన్‌లో చూసి ప్రధాన విషయాలు నచ్చాకే ప్రత్యక్షంగా మాటల్లోకి దిగుతున్నారు. అన్నీ సక్రమంగా ఉన్నవారే ఇంతగా అంతర్జాలం మీద ఆధారపడుతున్నప్పుడు ప్రత్యేక అవసరాలున్నవారి పరిస్థితి ఏమిటి? ఈ ఆలోచనే కొన్ని ప్రత్యేక ఆప్‌ల సృజనకు దారితీసింది. ప్రత్యేక అవసరాలున్న వారూ దీర్ఘకాలిక వ్యాధులతో బాధపడుతున్నవారూ ఈ ఆప్‌ల సహాయంతో తగిన భాగస్వాములను ఎంచుకోవచ్చు.

బెంగళూరుకు చెందిన విజయ్‌కి ఐదేళ్ల క్రితం నోటి క్యాన్సర్ వచ్చింది. అప్పుడతని వయసు 30 కూడా దాటలేదు. వెంటనే చికిత్స తీసుకున్నాడు. వ్యాధి పూర్తిగా నయమైంది. తిరిగి సొంత వ్యాపారం చేసుకుంటున్నాడు. అయితే శస్త్రచికిత్స చేసిన మచ్చలు ముఖం మీద మిగిలాయి. పెళ్లి సంబంధాలు మాట్లాడేటప్పుడు సర్జరీ విషయం చెప్తున్నాడు. కానీ అతనికి చాలాకాలం సంబంధం కుదరలేదు. విజయ్ లాంటి వాళ్లు మన సమాజంలో చాలామందే ఉంటారు. వివిధ అనారోగ్యాల కారణంగా జీవిత భాగస్వామి లభించక ఒంటరిగా గడుపుతున్న అలాంటి వారికోసం ఏర్పడిందే 'డివైన్ రిలేషన్స్.ఇన్' వెబ్‌సైట్.

### కొడుకు పోయిన బాధలో...

వివేక్ శర్మ వైద్య పరికరాల మార్కెటింగ్ చేస్తుంటారు. పలువురు వైద్యులతో ఆయనకు పరిచయం ఉంది. అలా వారితో మాట్లాడేటప్పుడు విజయ్ సమస్య చర్చకు వచ్చింది. దీర్ఘకాలిక వ్యాధులతో బాధపడే పలువురు ఒంటరిగా ఉండిపోతున్నారనీ, సరైన తోడు లభిస్తే వారు సంతోషంగా జీవితం గడపగలరనీ వైద్యులు చెప్పడం వివేక్‌ని ఆలోచింపజేసింది. వివేక్ కుమారుడు అమోఘ్ అంతు తెలియని అనారోగ్యంతో ఆకస్మికంగా మృతి చెందాడు. అది తట్టుకోలేక అతని భార్య తీవ్ర కుంగుబాటుకు లోనైంది. ఆ పరిస్థితుల నుంచి తేరుకోవడానికి ఏంచేయాలా అన్న ఆలోచనలో ఉన్న వివేక్‌కి డాక్టర్లు చెప్పిన విషయానికి సంబంధించే ఏదైనా చేయాలనిపించింది. వివేక్ స్నేహితుడొకరు కుమారుని పేరు మీద మిక్కీ చారిటబుల్ ట్రస్టు నిర్వహిస్తున్నారు. వివేక్ అతనితో తన ఆలోచనలు పంచుకున్నారు. ఆ ట్రస్టుని ఇద్దరి కుమారుల పేర్లూ కలిసేలా మిక్కీ అమోఘ్ ఫౌండేషన్‌గా మార్చారు. దాని ఆధ్వర్యంలో 'డివైన్‌రిలేషన్స్.ఇన్' అనే వెబ్‌సైట్‌నీ, ఆప్‌నీ గత ఏడాది నవంబరులో ప్రారంభించారు. ఎవరైనా ఇందులో సులువుగా రిజిస్టర్ చేసుకుని తమ ప్రొఫైల్ అప్‌లోడ్ చేయవచ్చు. తమకు నచ్చిన ప్రొఫైల్స్ ఎంచుకుని అవతలివారితో మాట్లాడుకోవచ్చు.

### దివ్యాంగుల కోసం ఇంక్లోవ్

వివిధ రకాల వైకల్యాలతో బాధపడుతున్న వారు మన దేశంలో 8 కోట్ల మంది ఉన్నారు. వారిలో ఐదు శాతం మాత్రమే వివాహితులు. మిగిలినవారంతా ఒంటరిగా జీవితాలను నిస్సారంగా గడిపేస్తున్నారు. ఈ పరిస్థితి కల్యాణి ఖోనాను ఆలోచింపజేసింది. నేటి సమాజంలో దివ్యాంగుల కోసం పెళ్లి సంబంధాలు వెదకడం అంత తేలిక కాదనీ అందుకే చాలామంది తోడు లేకుండా ఒంటరిగా మిగిలిపోతున్నారనీ ఆమెకు అర్థమైంది. శంకర్ శ్రీనివాసన్‌తో కలిసి ఈ దిశగా కృషి ప్రారంభించిన కల్యాణి 'ఇంక్లోవ్' పేరుతో ఆప్‌ను తయారుచేశారు. దివ్యాంగులకు వివాహ సంబంధాలు కుదిర్చే మొట్టమొదటి విజయవంతమైన ఆప్‌గా ఇది కొద్ది కాలంలోనే ఆదరణ పొందింది. దివ్యాంగులు తమలాంటి పలువురిని కలుసుకుని తగిన భాగస్వామిని ఎంచుకునే వేదికగా రూపొందింది. ఏడాదిన్నర క్రితం ప్రారంభమైన ఈ ఆప్‌లో ఇప్పుడు ఏడు వేల మందికి పైగా యాక్టివ్ వినియోగదారులున్నారు.


కల్యాణి
శంకర్ శ్రీనివాసన్
వివేక్ శర్మ

### అందరికీ అందుబాటులో...

ప్రస్తుతం గూగుల్ ప్లేస్టోర్ ద్వారా ఈ రెండు ఆప్‌లూ ప్రపంచవ్యాప్తంగా అందుబాటులో ఉన్నాయి. వయసు, ప్రాంతం, జీవనశైలి, వైకల్యం లేదా అనారోగ్యం వివరాలు... తదితరాల ఆధారంగా ఈ ఆప్‌లు తగిన సంబంధాలను సూచిస్తాయి. ఈ మెయిల్, ఫోన్ నంబర్లు ఇచ్చిపుచ్చుకునే అవసరం లేకుండా వీటిలోని చాట్ ఫీచర్ సహాయంతో ప్రాథమిక సంభాషణ జరపవచ్చు. స్క్రీన్ రీడర్ సహాయంతో దృష్టి సంబంధ సమస్యలున్నవారు కూడా వీటిని వినియోగించుకోవచ్చు. వ్యక్తిగత వివరాలను గోప్యంగా ఉంచుతారు. కావలసిన ఆప్‌ను డౌన్‌లోడ్ చేసుకుని, పేరు నమోదు చేసుకున్నాక ప్రొఫైల్ తయారుచేసుకోవాలి. అప్పుడు ఇతరుల ప్రొఫైల్స్ చూసే అవకాశం లభిస్తుంది. ఎవరిదైనా ప్రొఫైల్ నచ్చితే ఆ విషయం అవతలివారికి తెలియజేయాలి. వారూ అంగీకరించినప్పుడే చాట్ చేయడానికి అవకాశం లభిస్తుంది. సభ్యులు ప్రత్యక్షంగా కలుసుకునే అవకాశాన్నీ ఇంక్లోవ్ ఆప్ కల్పిస్తోంది. సోషల్ స్పేసెస్ పేరుతో వీరు తరచూ వేర్వేరు నగరాల్లో సమావేశాలు ఏర్పాటుచేస్తారు. ఈ సమావేశాలు ఎక్కడ, ఎప్పుడు జరిగేదీ ఆప్ ద్వారా సభ్యులకు ముందుగానే తెలియజేస్తారు. ఈ సమావేశాలకూ మంచి స్పందన వస్తోంది. చేతిలో ఉండే ఫోను ద్వారానే జీవిత భాగస్వామిని వెతుక్కునే అవకాశం లభించడం ప్రత్యేక అవసరాలున్న వారికి వరమే కదా! ★



